# వైశ్యప్రబోధిని

సాంఘిక మాస పత్రిక



శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవి



ఫిబ్రవరి 1994

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్

హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహ్మస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండి భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పై బడి విరాళంగా-ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

| | |
|---|---|
| **నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి** | **మేడా నరసింహులు శ్రేష్ఠి** |
| ఆధ్యక్షులు | ప్రధాన కార్యదర్శి |

V.P.- A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్యాన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం | బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం
✆ : 62 | ✆ : 3158 (S.T.D. 085195)
ప్రకాశం జిల్లా. | కర్నూలు జిల్లా.

**అక్షయ మహారాజ పోషకులు :** ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పై కమును షెడ్యూల్ బ్యాంకిలలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫొటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రూ.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆరోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫొటో సత్రావరణములో పెట్టబడును.

రూ.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

భోజనశాల, ప్రార్థనా మందిరము, కళ్యాణ మంటపము, గోశాల, సమావేశ భవనముతో కూడా 109 వసతి గదులు గల ఈ సత్రము ఆదర్శవంతంగా నిర్వహించబడుచూ, నిత్యాన్న దానము చేస్తున్నదని తెలియజేయుటకు సంతోసిస్తున్నాము.

రాష్ట్ర, రాష్ట్రేతర పుణ్యక్షేత్రాలలో నిర్వహింపబడుచున్న నిత్యాన్నదాన సత్రాలకు ప్రతి ఏటా ఒకటి లేక రెండింటికి రూ.50,000/-ల నుండి రూ.1,00,000/-ల వరకు ఆర్థిక సహాయము అందించాలన్న తీర్మానము సర్వసభ్య సమావేశముచే ఆమోదించబడినందున ఈ సత్రమునకు ఆర్థికసహాయం చేసిన దాతలు పరోక్షముగా రాష్ట్ర, రాష్ట్రేతరపుణ్యక్షేత్రాలలో నిర్వహింపబడుచున్న నిత్యాన్నదాన సత్రములకు కూడా దానము చేసినవారు అౌతారు.

పై మూడు పద్ధతులలో ఏదో ఒక పద్ధతిన ఈ అన్న సత్రమునకు ఆర్థిక సహాయాన్ని అందించి దైవ కృపకు పాత్రులు కమ్మని సోదరులకు విజ్ఞప్తి చేస్తున్నాము.

అన్నా సుబ్బ రంగయ్య — కార్యదర్శి

పోలిశెట్టి సత్యనారాయణ — అధ్యక్షులు

వైశ్య ప్రబోధిని
( మాసపత్రిక )
స్థాపితము
1969



సంపుటి
25



సంచిక
7



ఫిబ్రవరి-1994



సంపాదకులు :
'సంఘోద్ధారక',
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతంశ్రేష్ఠి



ప్రాప్తిస్థానం.
ఫోన్ : 45025
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్ "
జయనగర్ కాలని,
విద్యామందిర్
తూ॥ భాగం
కడప - 516 002.

సంపాదకీయం

# బడుగు జీవులపై వేటు

కారణాలు ఏవైనా పెట్రోలు, డీసెల్ ధరలను పెంచడము సమర్థనీయం కాదు. ఈనాటి సామాన్య ప్రజల జీవన వ్యయస్థాయిని గమనించగలిగిన ఏ ప్రభుత్వమూ ఈ చర్యకు పూనుకోదు. ధరలను పెంచడము పరోక్ష పన్నుల క్రిందికే వస్తుంది. ధరల విషయములో పరోక్ష పన్నుల ప్రభావము విశేషంగా ఉంటుంది.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పన్నులను విధిస్తూ ఎడా పెడా ప్రజల చెంపలను ఈ వరకే వాయించాయి. ధరల సూచిక ఒక్క శాతం పెరిగినా భరించలేని దుర్భర స్థితిలో ఇప్పుడు ప్రజలు ఉన్నారు. ఇది బహిరంగ సత్యము. అయినా ఈ విధంగా ధరల పెరుగుదలకు దోహదపడే విధంగా చర్యలు తీసుకోవడం సమంజసము కాదు. అందుకే వాణిజ్య వర్గాల ప్రతినిధులు "ఈ ధరల పెరుగుదల బడుగు జీవుల బ్రతుకులపై వేటు" అంటూ తమ ఆవేదనను వెలిబుచ్చారు:

పెట్రోలు, డీసెల్ ధరలను కేంద్ర ప్రభుత్వం పెంచినందువల్ల రవాణా చార్జీలను నాలుగు నుంచీ ఐదు శాతము వరకూ పెంచాలని ఆల్ ఇండియా టైర్ డీలర్స్ అసోసియేషన్ అప్పుడే ప్రకటించింది.

ఇతర వస్తువుల ధరలు ఒక ఎత్తు. పెట్రోలు, డీసెల్ ధరలు మరొక్క ఎత్తు. ఇతర వస్తువుల ధరల పెరుగుదల వాటి వరకే పరిమితమౌతుంది. పెట్రోలు, డీసెల్ ధరలు అలా కాదు. వాటి ప్రభావం సర్వ వస్తువుల మీద గణనీయంగా ఉంటుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పదే, పదే ధరలను అదుపులో పెట్టా మంటు చేసే వాగ్దానాలకు ఈ చర్య ఆత్మవంచనగా పరిణమిస్తుంది.

పెట్రోలు, డీసెల్ ధరలతో బాటు చెక్కెర ధరను కూడ పెంచడం మరో విశేషము.

బడ్జెట్ ప్రతిపాదన అతి సమీపములో ఉన్న ఈ తరుణములో ఈ పెట్రోలు, డీసెల్, పంచదారలను పెంచడము ఉన్నత విధానం కూడా కాదు.

ఇలా ధరలను పెంచుతూ పోతే ముగింపు ఎక్కడికి? అనేది ప్రధాన ప్రశ్న. 1972 నుండి 1994 లోపల అనగా రెండు దశాబ్దాలకు లోపల వివిధ ప్రభుత్వాలు పది స్లార్లకు పైగా పెట్రోలు ధరను పెంచాయి. 1972లో లీటరు పెట్రోలు ధర ఒక్క రూపాయ యాభై పైసాలు.

ధరలను పెంచడం - పన్ను విధింపుల శాతాన్ని హెచ్చించడం ద్వారా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తమ ఆదాయాన్ని పెంచుకోవాలను కోవడం విరమించుకొమ్మని గత పదేండ్ల నాడే మన ఆర్థిక శాస్త్రజ్ఞులు హెచ్చరించారు.

కేంద్ర ప్రభుత్వము కానీ, రాష్ట్ర ప్రభుత్వము కానీ తమ రాష్ట్ర ఆదాయాన్ని పెంచుకొనుటకు పన్నులను పెంచడమూ, క్రొత్తపన్నులను వేయడమూ, ధరలను పెంచడం వంటివి చేసే కన్నా, వివిధ దశల్లో జరుగుచున్న దుబారా వ్యయాన్ని తగ్గించు కోవడం, అవసరానికి తగ్గట్టుగా సిబ్బందిని నియమించుకోవడం వంటి పొదుపు చర్యలు చేపట్టడమే ఉత్తమమైన మార్గం.

# సూక్తి ముక్తావళి

"ఆపురమేలు 'మేలుబళి' యంచు బ్రజల్
జయవెట్టు చుండ, నా
జ్ఞా పరిపాలన వ్రతుడు శాంతి
దయాభరణుండు, సత్యభా
షాపర తత్వ కోవిదుడు సాధు
జనాదరణుండు దాన వి
ద్యాపర తంత్ర మానసుడు ధర్మ
తనూజు డుదగ్ర తేజుడై"

విజయ విలాసములో పాఠకులకు ధర్మరాజును పరిచయం చేస్తూ 'చేమకూర' చెప్పిన పద్యమిది. ఈ పద్యములోని 'సత్యభాషాపర తత్వకోవిదుడు' పదాన్ని ఆకాశవాణి శ్రోతలకు గుర్తుచేసేందుకై ఈ పద్యాన్ని చెప్పాను. సత్యభాషా = నిజమును చెప్పుటలో ఉన్న, పరతత్త్వము= ఉత్కృష్టమైన స్వరూపము లేదా రహస్యము. కోవిదుడు- అనగా తెలుసుకొన్నవాడు. ధర్మరాజు సత్యభాష యొక్క ఉత్కృష్టమైన తత్వాన్ని తెలుసుకొన్న నేర్పరి. సత్యభాష అనే పదానికి పరతత్వము అనే పదాన్ని జోడించడమే ఇక్కడ గమనించాల్సిన అంశము. సత్యమును పల్కుకడములో ఒక ఉత్కృష్టమైన రహస్యము ఉన్నది అని స్పష్టమైంది. సత్యమే దైవము. దైవమే సత్యము. దేవతలు, పితృదేవతలు, భూదేవతలు ఈ సత్యాన్ని సర్వదా ప్రశంశిస్తూ ఉంటారు.

"కుదురు సమస్త ధర్మములకున్ విను
సత్యము యోగ మోక్ష స
త్ప్రదములు సత్యకార్యములు, పాప
మసత్యము కంటె నొండు లే
దు, దలప నశ్వమేధములు తొమ్మిది
నూఱులు వేండి నూఱునై
యెదవిన నీడు గావు భరతోత్తమ
సత్యము తోడ నారయన్"

– అంటుంది భారతము. పై పద్యములో సత్యభాషా పరతత్వమును చెప్పుకొన్నాము. ఆ పరతత్వము యొక్క ఉత్కృష్ట స్వరూపము ఇక్కడ ఈ పద్యము వివరించింది.

సత్యము అనేది సమస్త ధర్మాలకూ కుదురు. అంటే పాదు. యోగము, మోక్షము, మంచి మార్గము అనేవి ఈ సత్యము యొక్క కార్యాలు. సత్యము పలుకక పోవడమే అసత్యము. అసత్యానికి మించిన పాపమే లేదు. వెయ్యి అశ్వమేధ యాగాలు చేస్తే వచ్చే పుణ్యము కూడ సత్యము పలుకుట వలన వచ్చే పుణ్యము నకు సమానం కాదు. ఈ ప్రభావం తెలిసిన వాడు కాబట్టే

"నిరయంబైన నిబద్ధమైన ధరణీ
నిర్మూలనంబైన నౌ
తిరగ న్నేరదు నాదు జిహ్వవినుమీ
ధీవర్య వే యేటికిన్"

– అంటాడు శుక్రునితో. వచ్చినవాడు సాక్షాత్తు విష్ణుమూర్తే. ఆయన వచ్చింది

తనను విగ్రహించడానికే. ఈ రెండు విషయాలు బలికి తెలుసు. కానీ మాట ఇచ్చాడు. ఆ మాటను వెనక్కు తీసుకోడానికి బలిచక్రవర్తి అంగీకరించడు ఎందుకూ? ఆయనకు సత్యమును పలుకుటలో గల ఉత్కృష్టమైన రహస్యం తెలుసు కాబట్టి.

ఒక గోవు ఒకనాటి గోధూళి వేళ అంటే ప్రొద్దు గ్రుంకు సమయములో ఇంటికి వస్తూ ఉంది. వస్తూ ఉన్న ఆ ఆవు ఒక పులి కంట బడింది. ఆవును చూస్తే పులికి ఏమనిపిస్తుంది? చంపి, దాని మాంసాన్ని తిన్నాలనిపిస్తుంది కదూ! పులిని చూసిన ఆ యావు తన బిడ్డ పాలకై పరితపిస్తూ ఉంది. పాలిచ్చి తిరిగి వచ్చి నీకు ఆహారం అవుతానంది పులితో గోవు మాటపై నమ్మకలేని ఆ పులి మొదట్లో అంగీకరించదు. గోవు ప్రార్థన విని చివరకు సమ్మతించి, వెళ్ళు. బిడ్డకు పాలిచ్చి సత్వరంగా రమ్మని గోవును పంపుతుంది. ఆ ఆవు వెళ్ళి ఆకలితో ఉన్న తన బిడ్డకు పాలిచ్చి తిరిగి పులి వద్దకు వచ్చి, తనను వధించి తిని నీ ఆకలిని తీర్చుకోమంటుంది. ఆ ఆవు సత్యమును పలుకుటలో గల గొప్పతనాన్ని గుర్తించిన ఆ పులి ఆ ఆవును వధించక, విడిచి పెట్టుంది. ఈ కథ అందరికీ తెలిసిందే. సత్యము యొక్క ప్రభావము ఆ విధంగా ఉంటుంది.

"సత్యమ్ము వలుకుట సర్వధర్మములకు
  మిక్కిలి యన్నుతంబు మేటి పాత
కము తద్విశేషంబు గలదు జెప్పెద నొరు
  నర్థంబు ప్రాణంబు నపహరింప
జూచు పాతకులతో సూనృతంబాడుట
  పాపంబు బొంకులు పలికి యట్ల
వారి హింసించుట వరధర్మ మిది యొక్క
  డెల్ల భూతములకు హితము సేయు
బొంకు లెల్లను ధర్మముల్ భూత బాధ
కంబు లగు నిక్కములు పాతకములు
  వినుము
భూతముల దుష్ట శిష్ట త్వములు వివేక
సూక్ష్మతా వేద్యములు వాని జూడవలయు

– అని మహాభారతము చెప్పుంది. అందువల్ల మానవుడు సత్యమునే పలుకాలి. సత్య వ్రత దీక్షలో ప్రాణాలర్పించిన వారెందరో మనకు చరిత్రలో కన్పిస్తారు. మనుషులే కాదు. ఆ సత్యభాషా పర తత్వమును తెలుసుకొన్న జంతువులు కూడా ప్రాణాంతకమైన సమయములో నైనా సత్యమునే పలుకుతాయి అనుటకు పైన చెప్పిన గోవు పులి కథ ఒక దృష్టాంతము.

సత్యము అను పదానికి ఉన్నది ఉన్నట్లు, కన్నది కన్నట్లు చెప్పడము అనేదే సర్వ సాధారణంగా చెప్పుకునే అర్థము. అయితే ఈ సత్యము అను పదానికే వేదపరంగా అర్థాన్ని చెప్పాల్సి వస్తే 'న్యాయము' అనే చెప్పాలి అంటాడు ఆర్య చాణక్యుడు.

ఒక బోయవాడు ఒక గోవును తరుముకుంటూ వస్తూ ఉన్నాడు. పారిపోతూ ఉన్న ఆ గోవు సత్యమును పలుకడమే నియమంగా పెట్టుకొన్న ఒక సత్యవ్రతుని

ఆశ్రమములోకి వచ్చి తలదాచుకొంటుంది. ఆ గోవును వెంటాడుచూ వస్తున్న ఆ బోయవాడు ఒక గోవు ఈ దారిన వెళ్ళిందా! అని అడుగుతాడు. అప్పుడు ఆ సత్యవ్రతుడు వాస్తవమును చెప్పాలా! చూడలేదు అని అసత్యము చెప్పాలా! చూడ లేదు అని చెప్తే అతని సత్య వ్రతమునకు భంగము కలుగుతుంది. తన ఆశ్రమములోనే ఆవు ఉంది అని చెప్తే, ఆ గోవు ప్రాణము పోతుంది. ఇటువంటి సందర్భములోనే సత్యమునకు న్యాయము అని అర్థము చెప్పాలంటాడు చాణక్యుడు. ఇక్కడ గోవు ప్రాణం కాపాడడమే న్యాయము. ధర్మశాస్త్రము న్యాయ సంరక్షణకే చెప్పబడింది.

" వారి జాక్షులందు వైవాహికములందు
ప్రాణమిత్త మాన భంగ మందు(
జకిత గోకు లాగ్ర జన్మ రక్షణమందు
బొంక వచ్చు నఘము బొంద దధిప"

– అని చెప్పిన ధర్మ సూక్ష్మము న్యాయాన్ని దృష్టిలో పెట్టుకొని చెప్పినట్టిది. శుక్రుడే కాదు. ఈ ధర్మ సూక్ష్మాన్ని చెప్తూ

"ఒరునర్థంబు ప్రాణంబు నపహరింప జూచు
పాతకులతో సూనృతంబాడుట బాపంబు"

– అంటాడు భీష్ముడు ధర్మరాజుతో. ఈ పద్యపాదము ఇంతకు ముందు చెప్పిన సీసములోనిది. శ్రోతలు గమనించే ఉంటారు. ఒక వ్యక్తి యొక్క సంపదను కానీ, ప్రాణాన్ని కానీ అపహరించాలనే అభిప్రాయములో ఉన్న పాప భీతి లేని వారితో సత్యాన్ని పలకడము గూడ పాపమే. సత్యమునకు యీ మినహాయింపులు ఒక సూక్ష్మమైన ధర్మాన్ని చెప్పుటకే కాని ఇవి ఆధారంగా చేసుకొని అసత్యమును పలకమని చెప్పుటకు కాదు.

సత్యమును చెప్పడానికి ఎంత శ్రద్ధా, ఆసక్తి ఉండాలో సత్యాన్ని తెలుసుకోడానికి కూడ అంతే ఆసక్తి, శ్రద్ధ ఉండాలి.

"వినదగు నెవ్వరు చెప్పిన
విని నంతనె వేగ పడక వివరింపదగున్
కని కల్ల నిజము తెలిసిన
మనుజుడే పో నీతి పరుడు మహిలో
సుమతీ"

– అని సుమతి శతక కారుని వాక్యము.

(సంపాదకుల ఆకాశవాణి ప్రసంగాల నుండి)

## వివాహం

అనంతపురం జిల్లా కల్లూరు వైశ్య ప్రముఖులు శ్రీ జి. రామలింగయ్య శ్రేష్ఠి గారి కుమారులు చి॥ సత్యనారాయణ, డి.ఫార్మా., గారి వివాహం, అనంతపురం వాస్తవ్యులు రిటైర్డు సెంట్రల్ ఎక్సయిజ్ సూపరింటెండెంట్ శ్రీ పి.బదరీ నారాయణ శ్రేష్ఠి గారి కుమార్తె చి॥ శైలజ, బి.ఎ., గారితో అనంతపురం కొత్తవూరు లోని శ్రీ వాసవీ కల్యాణ మంటపములో వైభవంగా జరిగింది.

గమనిక : ఈ శీర్షికలో ప్రకటన కావాలనుకొనే వారు రూ.116/–లు ఎం.ఓ. లేక డి.డి.ని ఆహ్వాన పత్రికతో బాటు పంపాలి.

## వీణావతి

శ్రీ బొడ్డు బాపిరాజు

(బాపిరాజుగారు మహాభావకులు. సరస సరళంగా సుమధురంగా పద్యాన్ని నడిపించగల జాషువా, కరుణశ్రీల సరసన నిలువగల కవిరాజు ఈ బాపిరాజు. కవిత్వములోని మాధుర్యాన్ని రసజ్ఞులు మాత్రమే గ్రహిస్తారు. వారి కొరకే ఈ ప్రచురణ – సంపాదకులు.)

బేలూరు చెన్నకేశవస్వామి దేవాలయం హొయసలరాజుల కీర్తి లక్ష్మికి మాణిక్యమకుటం, శిల్పకళకు క్షీరసాగరం. ఆధార శిలా శిల్పాలు అమృత ద్వీపాలు. వాటిలో లలితలావణ్య రేఖా మధురాకృతి వీణావతి.

ఇటులే యెన్ని శతాబ్దముల్ గడచె దన్వీ నీవు మందాకినీ
నటదూర్మిస్వనమోహనంబయిన వీణాదండముం బూని? చె
క్కిట రేయెండ చెమర్చె, నద్దుకొనబోకే కేశవస్వామి కే
మటు విన్పింటువు రాధికాప్రణయమిథ్యాకోపసందేశముల్.

సకలకళాజగద్విభవశారదవో వికసద్వసంతచం
పకసుకుమారి వేన్పకుమారకవో, స్థిరశిల్పయోగసా
ధకుని హృదంబుజాతమృదుతల్పమునం దొగి మేలుకొన్న మే
నకవొకొ, కానిచో నిజము నాకవితారసరాజ్యలక్ష్మివే !

ఏలలితస్వరమ్ము నినదించిన దా చిరుమోవి, సోగకై
వ్రాలిన చూడ్కి నే సొగసు పండిన, దామృదులాంగులీకసం
స్ఫాలనమందు, నే మధురభావము తోచిన దప్పు డా కళా
శాలి పసిండి పోగరకు శాశ్వతమై యవి నిల్చె మాయెదన్.

స్పందింపన్ రసవత్కళాహృదయచంచద్వల్లకీతంత్రు, లా
క్రందింపన్ బరపుష్టజీవనము కర్ణాటాంధ్రకన్యామణీ
సౌందర్యమ్ములు సంగమించిన భవత్సాన్నిధ్యమం దెవ్వడా
నందవ్యాకుల గర్వరేఖలకు లోనై యశ్రువుల్ రాల్చడో !

నీకు శిలాప్రవాసినికి నిద్దురదెల్పి, యనంతయౌవన
శ్రీకమనీయమూర్తిగ రచించిన శిల్పిమహేంద్రు డిప్పుడే
లోకము లేలునో మరి యెఱుంగము కాని తదీయకీర్తిగా
థాకృతు లాలకింతు మనుతాపభరమ్మున నీవిపంచికన్.

ఎన్నే శ్మెంత తపస్సు జేసితివి శిల్పీ! యిట్టి పాషాణముల్
వెన్న ల్మీగడలొౌచు నీకరములన్ విన్నాణముల్ సూపె, మా
కన్నే యానని యంత సన్నసనరేకల్ తీర్చినా వెట్లు నా
యన్నా! వీణియపైని తంత్రులవి యల్లల్లాడునో గాలికిన్.

కలగీతిన్ బ్రవహించు నెంతదనుకన్ గావేరిగోదావరీ
జలముల్ దేనెలసోన. లంతదనుకన్ సర్వప్రపంచంబునం
దల యే యొక్కడె కాని యుండినను సౌందర్యార్చకుం డీమహో
జ్జ్వల సృష్టింగని నీకు బల్కెడె నమోవాకమ్ము శిల్పిప్రభూ !

## వైశ్యులు – సంఘ సంస్కరణలు – 2

కాకినాడ వైశ్య ప్రముఖుడు, విజ్ఞాన ప్రబుద్ధుడు, మునిసిపల్ ఛైర్మెన్ అయిన పైడా రామకృష్ణయ్య వీరేశలింగం ప్రారంభించిన ఉద్యమానికి, విరాళము యివ్వడమే కాకుండ, (వితంతువుల వివాహాల కొరకు) వితంతువులను పెండ్లి చేసికొన్నవారికి నివాస గృహములు కట్టించి, శాశ్వతముగ వాళ్ళకే.యిచ్చాడు. కాకినాడ లోని వితంతు పునర్వివాహ సంఘమును స్థాపించాడు.

ఆత్మూరి లక్ష్మీ నరసింహం (1845-1908) మొదట మచిలీపట్నంలోనూ, తరువాత రాజమండ్రిలోనూ, ఉపాధ్యాయుడు, రాజమండ్రిలో వీరేశలింగం (1848-1919) ఆయన విద్యార్థి. సంఘ సంస్కరణోద్యమంలో వీరేశలింగం గారికి అండగా వున్నాడు. వితంతు వివాహానికి తోడ్పడినందుకు తనకు విరూపాక్షమఠం శంకరాచార్యుడు కులం నుండి వెలివేయగా, హైకోర్టులో దావావేసి శంకరచార్యునికి రు.200/- జుల్మానా పడేట్లు చేశాడు.

(ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమాలు (1848-1919) అను గ్రంథము ఆధారముతో)

సేకరణ
చుండూరి అప్పారావు
రావెల
గుంటూరు జిల్లా.

## 20న, రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య దశాబ్ది ఉత్సవాలు

హైదరాబాద్ ప్రధాన కార్యస్థానంగా గల రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ దశాబ్ది ఉత్సవాలు 20.2.1994వ తేదీ ఆదివారం సాయంత్రం 4 గంటలకు హైదరాబాద్ లోని కాచిగూడ వైశ్య హాస్టల్ ఆడిటోరియములో జరుగుతాయి.

# మేడా నరసింహులు గారికి "1994 నేషనల్ యూనిటీ" అవార్డు

హైదరాబాద్ నగర వైశ్య ప్రముఖులు, కాంట్రాక్టర్లు అయిన శ్రీ మేడా నరసింహులు గారికి "1994 నేషనల్ యూనిటీ అవార్డు" లభించింది. 1994 జనవరి 24వ తేదీన న్యూఢిల్లీలో జరిగిన 'నేషనల్ కాన్ఫరెన్సు ఆన్ ఎకనమిక్ డెవలప్‌మెంట్' లో ఈ అవార్డును శ్రీ నరసింహులు గారికి ఇచ్చారు. ఈ సందర్భంగా జరిగిన సభకు కేంద్ర ప్రభుత్వ గ్రామీణాభివృద్ధి శాఖామాత్యులు శ్రీ రామేశ్వర టాకూర్ గారు అధ్యక్షత వహించారు. కేంద్ర మానవ వనరుల శాఖామంత్రి శ్రీ అర్జున్ సింగ్ గారు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. న్యూఢిల్లీ లోని 'హోటల్ కనిష్క'లో ఈ కార్యక్రమం జరిగింది.



శ్రీ నరసింహులు గారు 1.7.1939వ తేదీన అనంతపురం జిల్లాకు చెందిన తిమ్మంపల్లి గ్రామంలో జన్మించారు. కీర్తి శేషులైన పుల్లయ్య, తులశమ్మ గారలు వీరి తండ్రి, తల్లి. వీరి శ్రీమతి శ్రీమతి శకుంతలమ్మ గారు. వీరికి 5 గురు కుమార్తెలు. వీరిలో తొలి ముగ్గురు వివాహితులే. పాఠశాల విద్యను జన్మసలమైన తిమ్మంపల్లెలోనూ, మాధ్యమిక విద్యను తాడిపత్రిలోని మాధ్యమిక పాఠశాలలోనూ అభ్యసించారు. అనంతపురము లోని ప్రభుత్వ సాంకేతిక కళాశాలలో చదివి, సివిల్ ఇంజనీరింగులో డిప్లొమా తీసుకొన్నారు. ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీరాజ్ శాఖలో కొంత కాలమూ, తమిళనాడు లోని నైవెల్లి లిగ్నైట్ కార్పొరేషన్ లో కొంత కాలమూ, ఆం.ప్ర. ప్రభుత్వ రహదారులు, భవనముల శాఖలో కొంత కాలమూ ప్రభుత్వ ఉద్యోగమును నిర్వహించి, ఆ ఉద్యోగ జీవితమునకు స్వస్తి పలికి, కాంట్రాక్టర్‌గా 1968లో సరిక్రొత్త జీవితాన్ని ప్రారంభించారు. 1971-78 వరకూ 'క్వాలిటీ కన్‌స్ట్రక్షన్ ఇంజనీర్స్' మేనేజింగ్ పార్టనర్‌గా పనిచేసి 1978లో శ్రీ మేడానరసింహులు ఇంజనీర్స్ అండ్ స్పెషల్ కాంట్రాక్టర్స్" అను సంస్థను ప్రారంభించారు. నీతి నిజాయితీలకు మారుపేరుగా ఆ సంస్థను పోషిస్తూ మంచి అభివృద్ధిని సాధించారు. 1978లో వీరు జీడిమెట్లలో ఓబులం

ఇంజినీరింగ్ ఇండస్ట్రీసను ప్రారంభించారు. పట్టిందల్లా బంగారమై తలంచిందల్లా తథ్యమై దిన దిన ప్రవర్ధమానంగా శ్రీ నరసింహులు అటు వ్యాపారంలోనూ ఇటు ప్రజాహిత కార్యక్రమాలకు సహకరించుట లోనూ గణనీయంగా పెరిగి కీర్తినీ, ప్రతిష్ఠలనూ ఆర్జించారు. అనేక మందికి సహాయ పడుచున్నారు.

1993 జూన్ నెల 2వ తేదీన వీరి వ్యాపార సంస్థ రజతోత్సవం ఘనంగా జరిగింది. ఇప్పటి ఆంధ్రప్రదేశ్ ఆర్థిక, వైద్య, ఆరోగ్య, శాసన సభావ్యవహారాల మంత్రులు శ్రీ కె.రోశయ్య గారు ఈ రజతోత్సవ వేడుకలను ప్రారంభించారు. స్వకులానికి సంబంధించిన, సర్వజనులకు చెందిన అనేకానేక సంస్థలలో వివిధ పదవులు అధిష్ఠించీ-అధిష్ఠిస్తూ శ్రీ నరసింహులు గారు తనకు భగవంతుడు ఇచ్చిన సంపదకు న్యాయాన్ని చేస్తున్నారు. మెస్సర్స్ ప్రమీదా చారిటబుల్ ఫౌండేషన్‌ను స్థాపించి, పేద ప్రజల విద్యాభివృద్ధికీ, వైద్య ఆరోగ్య సేవలకూ, విరాళములు ఇస్తూ, మంచి మనస్సుతో వ్యవహరిస్తూ ఉన్నారు.

కర్నూలు జిల్లాలోని ప్రసిద్ధ పుణ్య క్షేత్రమైన పెద్దఅహోబిలములో ఈనాడు అను నిత్యమూ స్వామి దర్శనానికై వచ్చే వైశ్య సోదరులకు షడ్రసోపేతంగా, నిత్యాన్నదానమును చేస్తున్న అన్నసత్ర నిర్మాణమూ, నిర్వహణ వీరి అకుంఠిత త్యాగ నిరతుల ఫలితమే.

## శ్రీ వాసవీ అష్టోత్తరశత హోమకుండ మహాక్రతు విశేషాలు

పశ్చిమ గోదావరి జిల్లా పెనుగొండలో మన మాతృశ్రీ వాసవీ దేవి సన్నిధిలో శ్రీ వాసవీ అష్టోతరశత హోమకుండ మహా క్రతువు ఘనంగా జరిగింది. 19.1.1994 నుండీ 27.1.1994 వరకూ జరిగిన ఈ మహా క్రతువు 19.1.1994వ తేదీ ఉదయం 7 గంటలకు మన రాష్ట్ర ఆర్థిక, వైద్య ఆరోగ్య శాఖామాత్యులు శ్రీ కె.రోశయ్య గారు జ్యోతిని వెలిగించుటతో ప్రారంభమైంది. స్వామి శ్రీ శివచరణ్ బ్రహ్మచారి గారి నేతృత్వములో, శ్రీశైల క్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్న సత్ర సంఘం వారి నిర్వహణలో జరిగిన యీ క్రతువు సదరు సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ మూర్తి వెంకటేశ్వర్లు గారి పర్యవేక్షణలో విజయవంతంగా సాగింది. నవాహ్నిక (9) దీక్షతో సాగిన యీ క్రతువును తొలి రోజున శ్రీ కె.రోశయ్య, రెండవ రోజున ఈ సంఘం అధ్యక్షులు శ్రీ ఆత్మకూరి నాగభూషణం శ్రేష్ఠి, మూడవ రోజున మాజీమంత్రివర్యులు శ్రీ ముత్తా గోపాలకృష్ణయ్య, నాల్గవ రోజున

ఆం.ప్ర. ఆర్యవైశ్య మహాసభ అధ్యక్షులు శ్రీ కె.వి.రమణయ్య, ఐదవనాడు పెనుగొండలోని శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయ ధర్మకర్తృత్వ మండలి అధ్యక్షులు శ్రీ కోట్ల వెంకట్రామయ్య, ఆరవనాడు పెనుగొండ ఆర్యవైశ్య యువజన సంఘం అధ్యక్షులు శ్రీ పెనుగొండ వెంకటేశ్వరరావు, ఏడవ నాడు ఆం.ప్ర. ఆర్యవైశ్య మహాసభ మాజీ ఉపాధ్యక్షులు శ్రీ బొండాడ రాధారమణ గుప్త, ఎనిమిదవ నాడు, తాడేపల్లె గూడెం వైశ్య ప్రముఖులు శ్రీ పెనుగొండ సుబ్బరాయుడు, తొమ్మిదవనాడు ఈ పత్రికా సంపాదకులు, 'సంఘోద్ధారక', 'వైశ్య భూషణ', శ్రీ పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి గారలు ప్రారంభించారు. ఈ తొమ్మిది రోజులలో ప్రతి రోజున వేలాది మందికి అన్నదానం జరిగింది. లక్షలాది మంది యీ యజ్ఞ కార్యక్రమాలను తిలకించి ఆనందించారు. 8 రోజులూ ఆధ్యాత్మిక ఉపన్యాసాలు, హరికథలూ, భజనలూ జరిగాయి. ఎనిమిదవ నాటి రాత్రి మార్కాపురం శ్రీ వాసవీ నాట్య కళామండలి వారు 'శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ చరిత్ర అను నాటకమును ప్రదర్శించారు. ఈ "యజ్ఞ కార్యక్రమాన్ని పురస్కరించుకొని పెనుగొండను లక్షలాదిమంది వచ్చి తిలకించారనీ, ఇంతగా జనం పెనుగొండ క్షేత్ర చరిత్రలో ఎప్పుడూ రాలేదనీ" పెనుగొండ క్షేత్ర ప్రజలు ఘనంగా చెప్పుకొని సంతోసించారు.

గుంటూరు జిల్లా బాపట్ల వైశ్య ప్రముఖులూ, శ్రీ వాసవీ వార్షిక మహా క్రతువు నిర్వహణా సంఘం సహాయ కార్యదర్శులూ శ్రీ పారేపల్లి సాంబశివ రావు, ఈ క్రతు నిర్వహణా సంఘం సహాయ కార్యదర్శులు శ్రీ యక్కలి తిమ్మశ్రేష్ఠి ప్రభృతులు యీ యజ్ఞ నిర్వహణలో శ్రీ మూర్తి వెంకటేశ్వర్లు గారికి గొప్పగా సహకరించారు.

పెనుగొండ శ్రీ ఆర్య వైశ్య యువజన సంఘం, శ్రీ వాసవీ మహిళా మండలి వారలు యీ యజ్ఞ నిర్వహణలో తేమ వంతు కర్తవ్యాన్ని శ్లాఘనీయంగా నిర్వర్తించారు.

## 'మూర్తి'కి బిరుద ప్రదానం

ఈ యజ్ఞ నిర్వహణను విజయ ప్రదంగానూ, ప్రశంసనీయంగాను జరుగుటకై అహర్నిలూ కృషి చేసిన శ్రీ మూర్తి వెంకటేశ్వర్లు గారికి "అన్నదాన బ్రహ్మ" అను బిరుదును అశేష జన మధ్యంలో శ్రీ శివచరణ బ్రహ్మచారి గారు ప్రదానం చేసారు.

## చిల్మకూరు నరసింహయ్యకు భార్యా వియోగం

కర్నూలు జిల్లా ఔకు వైశ్య ప్రముఖులు శ్రీ చిల్మకూరు నరసింహయ్య గారి భార్య శ్రీమతి వెంకట సుబ్బమ్మ గారు 16.1.1994న స్వర్గస్థులయ్యారు.

# నేను, నా దేశం

( గత సంచిక తరువాయి )

నారాయణరావుగారు సభకు రాగానే గంగరాజుగారు ప్రత్యేకంగా మాట్లాడటానికి వరండాలోకి పిలిచారు నారాయణరావు గారిని. సభ పూర్తికాగానే కలుసుకుంటానని నారాయణరావుగారు జవాబు పంపారు. సభకు అధ్యక్షుడిగా వుండుటకు ఎదురుకక్షి గంగరాజుగారిని, మేము నారాయణరావు గారిని ప్రతిపాదించాము. మేము పద్ధతి ప్రకారం సెకెండు చేశాము; వారలా చెయ్యలా. రూల్సు ప్రకారం నారాయణ రావుగారొక్కరే అభ్యర్థియని చెప్పి కుర్చీలో కూర్చోబెట్టాము. గంగరాజుగారి ముఠా లేచిపొయ్యారు. మేముగెలిచాం.

గెలిస్తే ఏం ప్రయోజనం? ఏలూరు వైశ్యసంఘంలో రెండు పార్టీలు ఏర్పడినై. అయినావాళ్ళెన్నాళ్ళు విడిపోయి వుండ గలరు? శుభా శుభ కార్యాలలో పిలుపు మానేసు కున్నారు. వంట కోమట్లు, నీళ్ళకోమట్లు భయపడ్డారు. సంస్కార ప్రియుల యిండ్లలో పనిచేయటం మానేశారు. క్రొత్త వారిని తెచ్చుకోవాల్సి వచ్చింది. మాజేటి రామచంద్రరావు లాంటి వారు కూడ మంచినీళ్ళ బిందెలు మోసు కోకతప్పలేదు. రెండు పార్టీలకు విసుగెత్తింది; 6 నెలలకు కలసిపోయారు. కాని, అందరూ వితంతూద్వాహాలకు సమ్మతించలేదు. అయితే, గుంటూరు కంటే ముందుకు వెళ్ళాము.

ఈ ఏలూరు వివాహంలో కూడ మా మీద దౌర్జన్యం చేయుటకు ప్రయత్నించారు. వివాహం జరిగేటప్పుడు ఊరేగింపులోను శ్రీ ఫుస్తాద్ హెపోలు వీరవెంకయ్యగారు నావెంట వుండేవారు. శ్రీ జవ్వాజి అప్పారావుగారి యింటిలో హెన్సు జరిగిన తర్వాత విందులో ఆ నాయుడుగారూ వున్నాడు. ఉస్తాద్ గారి చర్య నచ్చక "నా వెంటపడడానికి కారణ మేమని" కోపంతో అడిగాను. అప్పుడందరి ఎదుట ఏలూరులో మా పార్టీ యువకులు తన శిష్యులనీ, గంగరాజుగారి ప్రోద్బలంతో మరో తాలింఖానాలోని రౌడీలు నన్ను కొట్టడానికి చూస్తున్నట్టు తెలిసి నాకు బాడీగార్డుగా వుంటున్నామనీ చెప్పారు. ఇదివిని అందరూ ఆయన్ను అభినందించారు. నాకు ఆశ్చర్యం కలిగింది.

## ఉద్యమ వ్యాప్తి

ఆరు మాసాలలో బందరు, విశాఖ పట్టణాలలో ఏ ఆటంకాలు లేకుండా ప్రజా వుద్యమంగా మారిపోయినది. ఏలూరులో మరొక వివాహం కూడా చేయించాము. కొందరు వైశ్యులు పంక్తి భోజనానికి వచ్చారు. సంఘం ఎవరినీ ఆక్షేపించలేదు. ఈ విధంగా జయించాము. వివాహాలు చురుకుగానే జరిగిపోయాయి. రెండు, మూడు సంవత్సరాలలో

ఎవరింటిలో వారే మామూలు వివాహాల్లాగ జరుపుకోసాగారు. కష్టాలు తొలగిపోగానే శ్రీమంతులు కూడ వితంతు వివాహాలు ప్రారంభించారు. వారు రంగంలోకి రాగానే కల్యాణాలు, భేరాలు ప్రారంభమైనాయి. ప్రస్తుతం ఏలూరులో ప్రతి వైశ్య కుటుంబములోను ప్రత్యక్షంగానో, పరోక్షం గానో పునర్వివాహాలతో సంబంధం లేనివారే అరుదు.

ఇప్పుడు యితరులు మానేసినా, శ్రీ జవ్వాజి అప్పారావు గుప్త గారు, వారి కుటుంబము తమ విద్యుక్తధర్మాన్ని నెరవేర్చుకుంటూనే వున్నారు. ఎందరో అనాధలు (అన్ని కులాల వారు) వీరి సహాయం పొందుతున్నారు. వారిని నే నెంతో అభినందించుతున్నాను. ఇలాంటి వారివల్ల ప్రతిచోట ఆ ఉద్యమం ముందుకు పోతూనే వున్నది.

## కె.ఎస్. గుప్తాగారి ఎదురుదెబ్బ

గుంటూరు, ఏలూరు పట్టణాలలో మేము జయించ జాలనందుకు శ్రీ కె.ఎస్.గుప్తగారు మమ్ములను ఖండించాడు. తాను చేసి చూపుతానని, మూడవ వితంతూద్వాహాన్ని విశాఖపట్టణంలో చేయించాడు. ఇంటింటికిపోయి తాను, తన భార్య వివాహానికి రాని వైశ్యుల్ని కుల బహిష్కారం చేయించుతానని వీధుల్లో బహిరంగంగా హెచ్చరించాడు. వివాహానికి అయిదారు కుటుంబాల వారు రాలేదు. మరునాడు వారు గుప్త గారింటికి వెళ్ళి, రానందుకు క్షమాపణ కోరి, ముందు జరుగబోయే వివాహాన్ని తమ ఖర్చుతో చేయించుతామని మాటయిచ్చి వెళ్లారు. సంఘంలో ప్రజామోదంతో ప్రథమ వితంతూద్వాహం విశాఖపట్టణంలో జరిగింది. శ్రీ కందుకూరి వీరేశలింగంగారు ప్రారంభించిన యాభై సంవత్సరాలకు ఆయన ఉద్దేశ్యం ఫలించింది. తదాది ఆ జిల్లాలో నిరాటంకంగా ఎన్నో జరిగి పోతున్నాయి.

## బందరులో

బందరులో వితంతు వివాహాన్ని జయ ప్రదంగా ప్రజామోదంతో చేయించగలనని శ్రీ యం.ఎల్.ఎన్. గుప్తగారు మా కమిటీతో చెప్పి అవకాశం సంపాదించు కొన్నారు. గుంటూరులో వలెనే బందరు వైశ్యులు వైదిక బ్రాహ్మణులతో ఎన్నో తరాలుగా పోటీపడి వైదిక సాంప్రదాయా లలో వూరి పోయారు; వైశ్య వితంతు వులకు వెంట్రుకలు తీయించడం బందరులో ప్రారంభమై గుంటూరుకు పాకింది. బందరులో జయించడం కష్టమని తలచి ఆ పట్టణానికి అవకాశం యివ్వ కుండానే యితర పట్టణాలకు యిస్తూ వచ్చాను. అయితే, బందరులో యువ కులతో పోట్లాడుటకు సనాతనులకు గుండెధైర్యం లేదని వివాహ కాలమందు నాకు తెలిసింది. చుట్టు పట్ల గ్రామాల నుండి సుమారు పదివేలమంది వచ్చి వివాహంచూచి ఆనందించారు. అయిదు వేలమంది దాకా సహపంక్తి భోజనం చేశారు. డబ్బు వసూలు చెయ్యకనే యిన్ని వేల మందికి భోజనాలు పెట్టారు. ఏ వస్తువు లేకపోయినా వలంటీర్లు ఎడ్లబండిని

బజారుకు తీసుకెళ్ళి అడిగీ అడగకముందే వైశ్య వర్తకులు, ఇతర వర్తకులు బండి నింపేశేవారు. ఈ సంస్కరణ ప్రజామోదం పొందిందనుటకు ఏలాంటి సందేహంలేదని రూఢి అయింది.

ఇప్పుడు బందరులోనే వైశ్యులలో షుమారు ఆరవై కాపురాలవారు వితంతు వివాహం చేసుకొన్నవారున్నారు. ఎలాంటి అరమర లేకుండా కలిసిపోయారు. శ్రీ ఎమ్. లక్ష్మీనారాయణగుప్తగారు ఇప్పటికీ ఉత్సాహంతో వివాహాలు చేయిస్తూ, ఆ కుటుంబాలవారి కష్టసుఖాలను తండ్రి లాగా విచారించుతూనే వున్నారు. ఇలాంటి వారు వుండడంవల్లనే, సంఘ సంస్కరణోద్యమాలు జయప్రదంగా జరుగుతున్నాయి. అలాంటివారే అన్ని కులాల లోను అందరి ఆమోదం పొందుచున్నారు.

## ఇంకా అనేకం

ఆంధ్రదేశ మంతటా ఇంత జరిగిన తరువాత మరల గుంటూరులో వివాహం చేయించాము. కాని గుంటూరు వైశ్యులు ఒక్కరూ రాలేదు. చీరాలనుంచి ఒక్కరు మాత్రం వచ్చి, తాంబూలం మాత్రమే తీసుకొని వెళ్ళారు. భోంచేయుటకు సమ్మతించలేదు. కాబట్టి గుంటూరులో మరొక సారి ఓడిపోయాము. వైశ్యకులం మీద వైదిక బ్రాహ్మణుల ఆధిపత్యం పోయినా, వారి స్థానమాక్రమించిన వైదిక వైశ్యులు కాల ప్రవాహానికి ఎదురీదుచునే వుండిరి. ఎంధరో వైశ్యవక్తలు గుంటూరులో వున్నారు. ఆచరణలో ఒక్కరైనా సహాయ పడలేదు. వివాహమనగానే పరారయ్యే వారు.

అయినప్పటికీ, అప్పటికే ఉద్యమ సందర్భంలో మా యింటికి వచ్చివెళ్ళే వారి సంఖ్య హెచ్చిపోయింది. నేను గుంటూరు బ్రాడీపేటలో కాపురముంటున్నాను. మా యిల్లు తెలియనివారు ఆ వీధులలో ఎందరి నెంత శ్రమపెట్టారోగాని, ఒకనాటి రాత్రి మా గోడమీద ఎవరో "వెధవముండల పెళ్ళిళ్ళు చేయించే దరశి చంచయ్యగారి యిల్లు" ఇదేనని వ్రాశారు.

దానిని బట్టి నే నెంత చెడ్డపేరు పొందానో తెలుసుకొన్నాను. ఆ యింట్లో కాపురమున్నంత వరకు గోడమీద అలాగే వుండనిచ్చాను. చెడ్డ పేరు నా కెప్పుడూ వుంటూనే వుంది.

ఉద్యమము ప్రారంభించిన మూడు సంవత్సరాలకు (1928 సంllలో) బెజవాడ వితంతువు [శ్రీ దోమా వెంకటస్వామి గుప్తగారి మరదలుకు] ఏలూరులో వివాహం చేయించాము. ఎవరైనా వితంతువివాహం చేసుకోదలచి రాగానే, ఉత్సాహంగలవారు తమ యింటికి తీసుకెళ్ళి, తమ పెంపుడు బిడ్డగా భావించి, వివాహం చేయించడం బాగుంటుందని నిశ్చయించు కున్నాం. కూతుళ్ళులేని శ్రీ తుంపూడి భగవంతం గుప్తగారు ఆమెను తన పెంపుడు బిడ్డగా చూచుకొనుచుండిరి. ఎంతో ప్రేమతో ఆ బిడ్డకు సహాయం చేశారు. అయితే, ఆయన భార్య సమ్మతించలేదు. నల్లి మందుతిని చావుకు సిద్ధమైనది. డాక్టర్ల సహాయంతో బాగు చేయించి, తన పుద్దేశాన్ని ఎంతమాత్రం మానుకొనుటలేద. భార్యతో గట్టిగా చెప్పారు. ముగ్గురు

కొడుకులు, కోడళ్ళు గుప్తగారి పక్షం వహించారు. తన భార్య సహాయం లేనందున శ్రీ మోతే నారాయణరావుగారి తోడ్పాటుతో ఏలూరులో వివాహం చేయించారు. వివాహానికి గుప్తగారు తన భార్యను పిలువకుండా వధువు వగైరాలలో కలిసి ఏలూరు వచ్చారు. గుప్తగారి భార్య మనసు మార్చుకొని, తానూ పెండ్లికి వచ్చారు. పెండ్లిలో పీటలమీద కూడ కూర్చుని చేయించింది.

వధువు తల్లిదండ్రులు బెజవాడ రైలు స్టేషనులో కూతురును చూడటానికి వచ్చి, బండి కదిలినందున వివాహనికి రావలసి వచ్చింది. బెజవాడలో వారికీ కుల బహిష్కారం జరుగుననీ, మాకు సహాయం చేసే వైశ్యులుండరనీ మేము గ్రహించి స్వంత తల్లిదండ్రులను వివాహానికి రావద్దని ముందే సలహాయిచ్చాము. వచ్చినాక సహపంక్తి భోజనం చెయ్యకుండా జాగ్రత్త పడమనికూడా వారిని హెచ్చరించాము; కాని ఆ ఉత్సాహంలో వారుకూడా భోంచేశారు. బెజవాడకు తిరిగి వెళ్ళగానే వారిని శిక్షించుటకు ఛాందసులు ప్రయత్నించారు. నే నప్పుడు బెజవాడలోనే కాపురముంటున్నాను. నేను అనుకోని విధంగా బెజవాడ వైశ్యయువకులు తమ పెద్దల నెదిరించి వారి ఆట కట్టించారు. ఈ సందర్భంలో శ్రీ అన్నవరపు సుబ్బారావు గుప్తగారు చాలా ప్రయాస పడ్డారు. శ్రీ చుండూరి వెంకటరెడ్డి, వారి సోదరులు, శ్రీ చిట్టూరి రామకృష్ణయ్యగారు పాటు పడినారు. దానితో బెజవాడలో ఉద్యమం కొంత బలపడింది.

ఈ విధంగా మూడు సంవత్సరాల పాటు వైశ్య సంఘ నాయకులతో పోరాడుతూ వచ్చాం. ప్రారంభించిన ఐదేండ్లకు [1930] గుంటూరు వైశ్యులే ఒక వివాహాన్ని ఏర్పాటుచేసి, నన్నాహ్వానించి "రాళ్ళు వేసిన చేతులతో పూలు వేసారు" అప్పటికే అన్నిచోట్ల వందలాదిగా వితంతు వివాహాలు అన్ని కులాలలో జరిగాయి. ఎవరింటిలో వారు వైశ్యులు, కమ్మవారు మాత్రమే చేయించుతూ వచ్చారు. అయినా ఒక వితంతు శరణాలయం అవసరమనితోచింది.

## వితంతు శరణాలయ స్థాపన

నేను 1930లో మద్రాసులో కాపురం పెట్టాను. శ్రీ ముత్తా వెంకట సుబ్బారావుగారు, శ్రీ తుంపూడి భగవంతం గుప్తగారు, నేను కలసి మద్రాసులో ఒక వితంతు శరణాలయాన్ని స్థాపించాము. అన్ని కులాల వితంతువులకు ఆశ్రయం యిచ్చాము. 4–5 సం॥లు బాగా జరిగి పోయింది. అంతట కొన్ని కారణాలవల్ల, ముఖ్యంగా నిర్వహించలేక మానేశాము. తరువాత నర్సాపురంలో నా మిత్రుడు శ్రీ అద్దేపల్లి సర్వాశెట్టిగారు జయప్రదంగా ఒక శరణాలయాన్ని నిర్వహించడమేగాక, ఆంధ్ర దేశంలో నర్సాపురమే ఆ ఉద్యమానికి ముఖ్య కేంద్రంగా వృద్ధికి తెచ్చారు.

ఇతర కులాలలో వితంతు వివాహోద్యమము బలపడిన వివరాలకు ముందు ఈ ఉద్యమానికి తోడ్పడిన వైశ్య ప్రముఖులను గురించి వ్రాస్తాను.

## వైశ్యసంస్కర్తలు

శ్రీ యేటూరి వెంకటసుబ్బయ్య గారిది కడపజిల్లా వేంపల్లి గ్రామం. వారు నాతో కాలేజీలో చదువుకున్నారు. ఈయన వధువులను రాయలసీమ నుండి తెచ్చేవారు. ఆ వితంతువులకు సర్కారు జిల్లాలలో వివాహాలు చేయించుచుంటిమి. శ్రీ వెంకటసుబ్బయ్యగారెందరినో తెచ్చి ఉద్యమాన్ని జయప్రదం చేయించారు. క్రమంగా రాయలసీమలోనే వివాహాలు జరిపించుతూ వచ్చారు. వితంతువు లేకులానికి చెందినా తల్లిదండ్రులను ఒప్పించి సహాయం చేసేవారు.

శ్రీ సి.యస్. గుప్తగారు [నెల్లూరు] నా బాల్య స్నేహితుడు. తన పోలీసు సర్కిల్ ఇన్స్పెక్టర్ హోదాను వితంతూద్వాహాలకు ఉపయోగించేవారు. ఇప్పటికీ వివాహాలు చేయించుతూనే వున్నారు. వీరిని గురించి ఒక మంచి కథ ఉన్నది. మేమొక వితంతువును మేనమామల వద్ద నుండి రహస్యంగా తప్పించి మద్రాసుకు తీసుకురావలసి వచ్చింది. ఆ గ్రామం ఈ పోలీసు యిన్స్పెక్టరుగారి రేంజిలోది.పిల్లను తప్పించుకొని తీసుకొచ్చే పని నాయనకు వప్పగించాము. ఆ ప్రయత్నం సందర్భంలో ఆమెను ప్రేమించి, తానే వివాహం చేసికొన్నారు. ఈ దంపతులిప్పుడు ఇంటినిండా బిడ్డలతో, పెన్షన్ అనుభవిస్తూ సుఖంగా ఉన్నారు.

బందరులో శ్రీ లింగమల్లు జగన్నాధంగారు మా ఉద్యమారంభంలో కార్యదర్శిగా వుండి ఉత్సాహంతో నాకు కుడిభుజంగా పనిచేయుచుండిరి. ఒక వితంతువు వివాహం చేసుకోదలచి, తన మారుతల్లివద్దనుండి తప్పించమని ప్రార్థించింది. ఆ పనిని నిర్వహించుటకు శ్రీ జగన్నాధంగారిని పంపాను. ఆ ప్రయత్నాల సందర్భంలో ఆమె ఆయన్నే తన్ను వివాహం చేసుకోడానికి ఒప్పించింది. ఆయితే వివాహం జరగలేదు. వధువు మనసు మార్చుకొన్నది. ఆ దుఃఖంతో ఆయన చనిపోయారు. వారి మరణంతో నాకు వుద్యమ నిర్వహణ చాలా కష్టమయింది.

శ్రీ కె. కృష్ణారావుగారు ఆంధ్ర యూనివర్శిటీ ఆఫీసులో మేనేజరు. ఆయన కష్టమైన పనులు చేయుటకు సిద్ధపడేవారు. తల్లిదండ్రులవద్దనుండి రహస్యంగా వితంతువులను తప్పించడమంటే కృష్ణారావుగారికి చాలాయిష్టం. అపాయాన్ని లెక్కచేసేవారు కాదు.

ప్రొద్దుటూరు వాస్తవ్యులు శ్రీ కొప్పరపు సుబ్బయ్యగారు ఆ జిల్లా వైశ్య నాయకులు. ఈ ఉద్యమానికి తమ పలుకుబడి నుపయోగించారు. ప్రత్యక్షంగా వచ్చి సహాయం చెయ్యలేదుః కాని ఆ జిల్లాలో వితంతు వివాహం చేసుకొన్న వారికి ఎలాగో కులబహిష్కారం లేకుండా సహపంక్తి భోజనాలు పెట్టించి, కష్టాలను తొలగించుతూ వచ్చారు.

వైశ్యులలో ఇప్పుడు వయస్సుకు సంబంధించిన ఆటంకాలు కాని, బిడ్డలున్నారనే ఆటంకాలు గాని, పునర్వివాహ విషయంలో సంఘసంబంధమైన బాధలు గాని ఎంత మాత్రం లేవు. శ్రీ కందుకూరి వీరేశలింగంగారి ఉద్దేశ్యం వైశ్యసంఘములో పూర్తిగా నెరవేరింది. (ఇంకా ఉంది)

# పంచాంగము - మానవుడు

రచన : శ్రీ నల్లసాల వేణుగోపాల్, బి.ఎ., ధర్మవరము.

సకల చరా చర సృష్టి, స్థితి, లయ, కారకుడైన త్రిమూర్తి స్వరూపుని ఆధీనమే యీ సర్వజగత్తు. ఆ మహిమాన్వితుని సంకల్పమే యీ జగత్తు. వాని రూప కల్పనయే యీ సృష్టి.

మానవుడు ప్రకృతికి బద్ధుడు. పరమాత్ముని ఆధీనుడు. భగవంతుని ఆన లేనిదే చీమయైనను కదలదు అనే నానుడి మనకు తరచూ వినిపిస్తూ వుంటుంది. ఇది అక్షర సత్యము. ప్రకృతిపై మానవుడు చేసే అనేక అద్భుత ప్రయోగాలను మనము నేడు చూస్తూవున్నాము. నిజంగా ఆలోచన చేసి సవ్యాత్మతో విలోకిస్తే మానవుని మేధస్సును సృజించిన ఆ పరమాత్మ నిజంగా ఉత్తమోత్తముడే కదా.

ప్రపంచ సృష్టి యావత్తూ క్షణ క్షణము ఉత్తుంగ డోలాయమాన తరంగాలతో శుభాశుభ పరిణామాలతో నిండి నిబిడీకృతమై వుంటుంది.

మానవునకు చక్షువులు, శ్రవణేంద్రియాలు, నాసిక, మేధస్సు, హృదయము, కాలు చేతులు, ఎట్లు ప్రధాన అంగాలో అట్లే మానవ జీవన స్రవంతికి, 'పంచాంగము' మూలాధారము. అట్టి పంచాంగమునకు పంచ అంగములు ముఖ్యమైనవి.

అవి ఏవన్న, తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములు, 1) తిథి సంపదను, 2) వారము ఆయుర్వృద్ధిని, 3) నక్షత్రము పాపక్షయమును, 4) యోగము రోగ నివృత్తిని, 5) కరణము కార్యసిద్ధిని సిద్ధింప చేయునునుట శాస్త్ర సమ్మతము.

కాన పంచాంగమునకు మూలాధారమైన పై పంచ అంగములు మానవుని నిత్య జీవితముపై క్రీనీడలా వెంటాడుతూ వుండును. మానవుని జన్మము, వృద్ధి, మరణము, వీటిపైననే ఆధారపడి యుండును.

"జాత్యస్యమరణంధ్రువం" అనే విషయము సర్వులకు అవగతము. కాని, వారి సంచిత ప్రభావము వీనికి లోబడియో వుండును అనునది సర్వ విదితము.

పురాకృత పుణ్య, పాపాలననుసరించి మానవ జన్మము గ్రహనక్షత్రాలకు లోబడి జరుగుతూవున్నది. నమ్మకము లేనివారికి, దైవమే లేదని వాదించువారికి, నిత్య శంకితునికి యీ జాతక మర్మమును తెలుపుట వృధా. చెవిటి వానికి శంఖాదినట్లు వుండును.

ప్రకృతియందు రాత్రి పగలు, సూర్య చంద్రుల బింబ ప్రతిబింబములవల్ల ఎట్లు ఏర్పడుచున్నవో అట్లే రవి, చంద్రుడు, నక్షత్రములు, యితర గ్రహములపైననే మానవ జీవిత భవిష్యత్తు నిర్మితమవు

తున్నది.

నవ గ్రహములు 9. అవి, రవి, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురువు, శుక్రుడు, శని, రాహువు, కేతువు.

ఈ నవ్య ప్రపంచములో మానవుని మేధస్సు అమోఘము. వాడు సహా ఖగోళమును బాగుగా శోధించి పై చెప్ప బడిన గ్రహములు వున్నాయని వాటిలో కొన్నింటిపై తాను కాలును పెట్టాడని మనము నేడు చూస్తూవున్నాము కదా.

సాంకేతిక, శాస్త్ర విజ్ఞాన పరంగా చూస్తే పై నవగ్రహములు రౌద్ర, భయానక, శాంత, గంభీరాలకు ఆలవాలమైనవని మన శాస్త్రజ్ఞులు యీనాడు మనకు ఋజువు చేసినారు. రవి గ్రహము దరిదాపులకు కూడ మానవుడు వెళ్ళ లేడంటే ఆ గ్రహ మెంతటి భయానక, భీభత్సమో, చంద్ర గ్రహముపై మానవుడు కాలూనినాడంటే ఆ గ్రహ ప్రభావమెంత చల్లనిదో, కుజ గ్రహము వాసయోగ్యము మానవునికి కాగలదు అని ఋజువు చేసుకొన్నాడంటే భవిష్యత్ శాస్త్ర మెంత బలవత్తరమైనదో మనము వీటిని బట్టి నవగ్రహ ప్రభావము మానవాళిపై ఉన్నదనుట మనము నమ్మి తీరవలసినదే కదా.

పితృ కారకుడు రవి అనియు, మాతృ కారకుడు చంద్రుడనియు, భూకారకుడు కుజుడనియు, జ్యోతిశాస్త్రము మనకు తెలుపుతూ వున్నది.

నేటి విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానములో మానవుడు గ్రహాంతరాలను పరిశోధించి నప్పటికి జ్యోతిషశాస్త్ర గ్రహనిరూపణము జ్యోతకమవుతూవుంది కదా.

మానవ జీవిత మనుగడకు రవి చంద్రులు రథమునకు వున్న ద్విచక్రా లనియు, కుజుడు రథస్థలమనియు, రథమునకు పూన్చిన రెండు అశ్వములు గురు, శుక్రులనియు, రథచోదకుడు బుధుడనియు ఆ రాహు కేతువులు స్థల నిర్దేశన జనితులని గ్రహించుట ఎంతయో ముదాహము.

నీలాకాశములో తారలను అనేకము మనము నిత్యము చూస్తూ వుంటాము. కాని ముఖ్యంగా ఆధిపత్యము నొందిన నక్షత్రములు యిరవది ఏడు మాత్రమే. అవి, అశ్వని మొదలు రేవతి వరకూ గల నక్షత్రములు. అవి మానవుని పైననే కాకుండా ప్రకృతిపై సహా తమ ప్రభావాన్ని చూపుతూ వుంటాయి.

సంవత్సరమునకు పంద్రెండు మాస ములు ఎట్లో అట్లు రాసులు 12. "భ" చక్రముపై నిర్దేశితమై వున్నవి. అవియే, 1.మేషము, 2.వృషభము, 3.మిధునము, 4.కర్కాటకము, 5.సింహము, 6.కన్య, 7.తుల, 8.వృశ్చికం, 9.ధనుస్సు, 10.మకరము, 11.కుంభము, 12.మీనము.

అశ్వని మొదలు రేవతి కాగల యీ 27 నక్షత్రములకు పై 12 రాసులకు చక్కని అవినాభావ సంబంధం వున్నది. ఆ పాలనా విభజనను తెలుసుకొనుటకు ముందు యీ క్రింది విషయాన్ని గుర్తించుట యెంతయో ముఖ్యము.

ప్రతి నక్షత్రానికి 4 పాదములు ఉండును. 27 నక్షత్రాలకు చెరసి 27×4= 108 పాదములు అగును. అట్టితరి. పై కనపరచిన 12 రాసులకు 108 పాదములు అగును. అనగా ఒక్కొక్క రాశికి 9 పాదములు వచ్చుననియు ద్యోతకమవుతుంది. యీ క్రింది పట్టికను గ్రహించిన విషయము పూర్తిగా తెలియ గలదు.

| నక్షత్రం | పాదము | రాశి |
|---|---|---|
| అశ్వని | 4 | |
| భరణి | 4 | మేషం |
| కృత్తిక | 1 | |
| కృత్తిక | 3 | |
| రోహిణి | 4 | వృషభం |
| మృగశిర | 2 | |
| మృగశిర | 2 | |
| ఆరుద్ర | 4 | మిధునం |
| పునర్వసు | 3 | |
| పునర్వసు | 1 | |
| పుష్యము | 4 | కర్కాటకం |
| ఆశ్లేష | 4 | |
| మఖ | 4 | |
| పుబ్బ | 4 | సింహం |
| ఉత్తర | 1 | |
| ఉత్తర | 3 | |
| హస్త | 4 | కన్య |
| చిత్త | 2 | |

| నక్షత్రం | పాదము | రాశి |
|---|---|---|
| చిత్త | 2 | |
| స్వాతి | 4 | తుల |
| విశాఖ | 3 | |
| విశాఖ | 1 | |
| అనూరాధ | 4 | వృశ్చికం |
| జ్యేష్ట | 4 | |
| మూల | 4 | |
| పూర్వాషాఢ | 4 | ధనస్సు |
| ఉత్తరాషాఢ | 1 | |
| ఉత్తరాషాఢ | 3 | |
| శ్రవణం | 4 | మకరం |
| ధనిష్ట | 2 | |
| ధనిష్ట | 2 | |
| శతభిషం | 4 | కుంభం |
| పూర్వాభాద్ర | 3 | |
| పూర్వాభాద్ర | 1 | |
| ఉత్తరాభాద్ర | 4 | మీనం |
| రేవతి | 4 | |

ఈ విధంగా నక్షత్రములు పై రాసులకు ఆధిపత్యమునొంది తమ ప్రభావమునకు జాతకుని జన్మ నక్షత్రము పాప పుణ్య ఫలితాలను అందివ్వగలగుతుంది.

ఇది ఒక మానవునకే కాక, రాష్ట్రమునకు, దేశమునకు, యావత్తు ప్రపంచానికి వాటి జన్మనుబట్టి దశ అంతర్దశ సమయము లందు శుభ అశుభ ఫలితాలను యివ్వగలుగుతున్నాయి. కాననే పంచాంగము

నందు ముఖ్యమైన నక్షత్రము పాప క్షయము తెలుపునని పంచాంగకర్తలు నుడివినారు.

పై 27 నక్షత్ర స్వరూప సామ్యములు 7 రీతులుగా వుండును.

1. క్షిప్ర నక్షత్రములు :– 1. అశ్వని, 2.హస్త, 3.పుష్యము యీ మూడు నక్షత్రములు శీఘ్ర ఫలితములు యిచ్చును.

2. దారుణ నక్షత్రములు :– 1. ఆరుద్ర, 2.మూల, 3.జ్యేష్ఠ, 4.ఆశ్లేష పై నక్షత్రములు నాలుగు చెడు ఫలితములు యిచ్చును.

3. మృదు నక్షత్రములు :– 1. చిత్త, 2.రేవతి, 3.మృగశిర, 4.అనూరాధ పై నక్షత్రముఖు శుభ ఫలితములు యిచ్చును.

4. స్థిర నక్షత్రములు :– 1. రోహిణి, 2.ఉత్తర, 3.ఉత్తరాషాఢ, 4.ఉత్తరాభాద్ర పై నాలుగు నక్షత్రములు స్థిర ఫలితములు యిచ్చును.

5. ఉగ్ర నక్షత్రములు :– 1. భరణి, 2.మఖ, 3.పుబ్బ, 4.పూర్వాషాఢ, 5.పూర్వాభాద్ర పై అయిదు నక్షత్రములు ఉగ్ర ఫలితములు యిచ్చును.

6. చర నక్షత్రములు :– 1. స్వాతి, 2.పునర్వసు, 3.శ్రవణం, 4.ధనిష్ట 5.శతభిషం పై అయిదు నక్షత్రములు చంచల ఫలితముల నిచ్చును.

7. సాధారణ నక్షత్రములు :– 1.కృత్తిక, 2.విశాఖ పై రెండు నక్షత్రములు సామాన్య ఫలితముల నిచ్చును.

కాని ప్రకృతి మానవునిపై నక్షత్ర శుభా శుభా ఫలితాలను, ద్వాదశ స్థాన ఫలితాలను పట్టి, వాని దశ, అంతర్దశ సమయములందు ద్యోతకమగుట సమ్మతము.

భగవంతుని లీలలు అద్భుతము. కాననే మానవ, జల, చర, వనచర రూపాలు అనంతకోట్లు. రూపరూపానికి సామ్యమే ఉండదు కదా. మానవ నిర్మితానికి మానవుడు రూపస్వామ్యాన్ని యిస్తున్నాడు కదా. సదా కల్యాణధాముని మానవ ప్రకృతి సృష్టికి కల్యాణాన్ని ప్రసాదించాలని వినమ్రులై పరమాత్ముని ప్రార్థిస్తాము.

ఓం శాంతి, శాంతి, శాంతిః.

**27న రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య – ఆం.ప్ర. ఎన్నికలు**

హైద్రాబాద్ ప్రధాన కార్యస్థానంగా గల పై సమాఖ్య సర్వసభ్య సమావేశము – ఎన్నికలు 27.2.1994వ తేదీ ఆదివారం సాయంత్రము 4 గంటలకు హైద్రాబాద్ లోని కాచిగూడ వైశ్య విద్యార్థి వసతి గృహ సమావేశ భవనములో జరుగును.

**జీవిత సభ్యత్వ చందా రూ.400/-**

# వైశ్య ప్రబోధిని – క్యాలెండరు

( 1994 ఫిబ్రవరి 21 నుండి 1994 మార్చి 20 వరకు )

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 27 | 6 | 13 | 20 |
| సోమవారము | 21 | 28 | 7 | 14 | |
| మంగళవారము | 22 | మార్చి 1 | 8 | 15 | |
| బుధవారము | 23 | 2 | 9 | 16 | |
| గురువారము | 24 | 3 | 10 | 17 | |
| శుక్రవారము | 25 | 4 | 11 | 18 | |
| శనివారము | 26 | 5 | 12 | 19 | |

ఫిబ్రవరి 22 :– భీష్మ ఏకాదశి (స్మార్తులకు)

ఫిబ్రవరి 23 :– భీష్మ ఏకాదశి (వైష్ణవులకు)

ఫిబ్రవరి 25 :- A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది.

ఫిబ్రవరి 28 :- షెడ్యూల్డు కామోడిటీస్ లైసెన్సును రెన్యూచేయమని కోరుచూ పంపవలసిన దరఖాస్తును పంపుటకు ఆఖరు తేది.

మార్చి 4 :- పూర్వాభాద్ర కార్తె ప్రారంభం.

మార్చి 10 :- మహాశివరాత్రి.

మార్చి 14 :- రంజాన్ - దుకాణాలు-సంసలు, కర్మాగారాలు-సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

మార్చి 15 :- చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతోబాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి పంపుటకు ఆఖరు తేది.

మార్చి 17 :- ఉత్తరాభాద్ర కార్తె ప్రారంభం.

**27, 6, 13, 20 ఆదివారాలు**

---

నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.
## ( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )

టెలిగ్రాం అన్ని చోట్లా " VASAVI "
టెలిఫోన్ నెంబరు : మార్కాపురం : 2595, శ్రీశైలం : 3140, 3114,
పుట్టపర్తి : 2040, తిరుమల : అప్లైడ్.

## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :– 128 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, 4 పెద్ద హాల్సు, పూర్తిగా తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో ఒక లక్షయాభై వేల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00 లు శాశ్వతసభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును.

   రెండవ అంతస్తులో 37 రూములు కట్టుచున్నాము. 30×10 రూము రూ.30,000/-, 15×7 రూముకు రూ.20,000/- అగును. రూము విరాళంయిస్తే దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 75 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. సాధ్యమైనంత త్వరలో పూర్తిగా అన్ని వసతులతో నిర్మాణం చేసి, నిత్య భోజనములు ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు త్వరలో జరుగుచున్నవి. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.80,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 10×25 రూమ్‌కు రూ.50,000 ఇచ్చిన యెడల దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 100 రోజులు రూము యివ్వబడును. మిగతా రోజులు యాత్రీకులకు యివ్వబడును.

3. వాసవీ భవన్, తిరుమల : తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనపు పనులు చురుకుగా సాగుచున్నవి. రెండు హాల్సు 52×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) నిర్మాణములో కలవు. సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డోనేషన్లు స్వీకరించబడును.

I&II ఫ్లోరు రూము డోనార్సు : 10 రూములకు పరిమితము. ఒక లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు సంవత్సరంలో 30 రోజులు రూము యివ్వబడును. వారి ఫోటో శిలా ఫలక రూములో వేయబడును.

హాల్సు డోనార్సు : 52×10 అడుగుల ఒక అంకణము హాలుకు లక్షరూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు ఉచితంగా యివ్వబడును. 20 అంకణములు పరిమితం.

మహారాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. పది వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో ఐదు రోజులు రూము యివ్వబడును. ఫోటో శిలా ఫలకము వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును.

రాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. ఆరు వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో మూడు రోజులు రూము యివ్వబడును. నాపరాయిపైన పేరు వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును. "వాసవీ భవన్, తిరుమల"కు కార్యదర్శి కార్యాలయం, మార్కాపురం అని వ్రాసి ముందుగా పంపు వారి DD మాత్రమే ఆమోదించబడును. చెక్కులు పంపవచ్చును. కాని ఆ చెక్కులు చెల్లివచ్చినప్పుడే సీరియల్ లోకి వచ్చును. అవకాశము లేని వారి పైకము తిరిగి వాపసు పంపు అధికారం సంఘమునకు కలదు. DD లు మార్కాపురం, స్టేటు బ్యాంకు, వైశ్యా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్ లపై పంపగోర్తాము. త్వరలో తిరుమలలో ఆఫీసు ఓపెన్ చేస్తాము. అంతవరకు పై అడ్రసుకు పంపకోర్తాము.

4. వాసవీ నిలయం, పెనుగొండ : పరిశీలనలో ఉంది.

5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ

పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో నాలుగు సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన నాలుగు సత్రములలో వేయబడును. వీరికి వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం అన్ని సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారం పర్య సభ్యులు. వీరి ఫోటో మన సంఘము నిర్వహించు అన్ని సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా అన్ని సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో దాత కోరిన మన సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో దాత కోరిన ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వేయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు దాత కోరిన ఒక సత్రములో నాపరాయిపైన వేయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ పంపకం కమిటీ తీర్మానం ప్రకారం నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

-: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :-


మూర్తి వెంకటేశ్వర్లు, వాసవీ సత్రముల కార్యదర్శి కార్యాలయం,

మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

అధ్యక్షులు : ఆత్మకూరు నాగభూషణం శ్రేష్ఠి, నంద్యాల.


**N.B** : పై సత్రముల పేరుతో - D.D లు కాని, చెక్కులుకాని పంపకోర్తాము. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# రామచరిత మానసం

( తులసీ రామాయణము )

తెలుగు సేత : శ్రీ గాథంశెట్టి శ్రీరాములు, యం.ఎ.

( గత సంచిక తరువాయి )

లంక చాలా బలిష్ఠమైన కోట అని తెలిసినా రామప్రతాపం తెలుసుకొని నిర్భయంగా సైన్యాలన్నీ ముందుకు నడిచాయి. మేఘాలు కమ్ముకున్నట్లు లంకానగరాన్ని నలు వైపులా చుట్టుముట్టి యుద్ధ భేరీలు మోగించారు.

మహా బలవంతులైన వానరులు, భల్లూకాలు 'శ్రీరామచంద్రమూర్తికీ జై, లక్ష్మణజీకీజై, వానర రాజు సుగ్రీవునకూజై' అంటూ కొండలు ప్రతిధ్వనించేటట్లు నినాదాలు చేస్తూ వున్నారు.

లంకానగరమంతా హడలెత్తిపోయింది. కోలాహలం పెరిగిపోయింది.

రావణుడు రాక్షస సేనలను సమాయత్త పరచాడు. చావుకాలం సమీపించే, వానరులు వచ్చారన్నాడు. నలువైపులకు వెళ్లి ఎక్కడి వాళ్లను అక్కడ తినెయ్య మన్నాడు. రాక్షసులంతా రకరకాల ఆయుధాలు పట్టుకొని పరుగెత్తారు. కోట బురుజులపైన ఎక్కారు. మేరు పర్వతం పైన మేఘాలు కమ్ముకున్నట్లున్నారు. భేరీలు మ్రోగుతున్నాయి. ఆమోతకు వీరులంతా ఉద్రేక పడుతూ ముందుకు వెళ్లారు. ఎదురుగుండా వస్తూవున్న విశాల కాయులైన వానరులను చూశారు.

వానర వీరులంతా పళ్లు పటపటా కొరుకుతూ వున్నారు. గుంటలు మిట్టలు లెక్క చేయకుండా ముందుకు వురుకుతున్నారు.

అటువైపు రావణుడికీ, ఇటువైపు రాముడికీ జయజయ నాదాలు చేస్తూ వున్నారు. ఈ జయజయ ధ్వనులతో యుద్ధం ప్రారంభమైంది.

రాక్షసులు పై నుండి పర్వత శిఖరాలను కుప్పలు కుప్పలుగా విసరి వేస్తున్నారు. వానరులు ముందుకు దూకి వాటిని పట్టుకొని మళ్లీ వాళ్ల మీదికే విసరి వేస్తున్నారు. ప్రచండమైన వానరులు, భల్లూకాలు, కొండ చరియలను కోటపైకి విసరి వేస్తున్నారు. రాక్షసులను కాళ్లు పట్టుకొని నేలకేసి కొడుతున్నారు. తేజస్సంపన్నులైన వానరులు కోట లోపల జొరబడి, భవనాల్లో ప్రవేశించి రాముని యశస్సును కీర్తిస్తున్నారు. కోటబురుజులు ఎక్కిన వానరులు సూర్యుని వంటి ప్రకాశంతో వెలిగి పోతూ రాముని పేరు చెప్పి జయ జయ ధ్వనులు చేస్తూవున్నారు.

ప్రచండ వాయువేగానికి మేఘాలు పరుగెత్తి పోయినట్లుగా వానరుల తాకిడికి రాక్షసులు పరుగెత్తి పోతున్నారు. లంకా నగరమంతా అల్లకల్లోలంగా తయారైంది. పిల్లలు, రోగులు, స్త్రీలు హా హా కారాలు చేస్తూవున్నారు. అందరూ కలిసి రావణుణ్ణి తిట్టుకుంటున్నారు.

రాక్షస సేనలు చెల్లా చెదరు గావడం, వెనక్కి పరుగెత్తడం రావణుడు చూశాడు. వాళ్ళందరినీ మళ్ళీ ముందుకు తరిమాడు. యుద్ధంలో వెనక్కి తిరిగివచ్చిన వాళ్ళను నేనే చంపివేస్తానని బెదిరిస్తూ వున్నాడు. ఇన్నాళ్ళు నా సొమ్ము తిని, ఇప్పుడు యుద్ధంలో ప్రాణాలు తీపి అయ్యాయా! అంటూ అరుస్తున్నాడు.

రావణుని బెదరింపులతో రాక్షసులు సిగ్గు పడిపోయి యుద్ధంలోనే చచ్చి పోదామనే నిర్ణయంతో మళ్ళీ ముందుకు పోతూ వున్నారు. వాళ్ళందరూ బరిసెలు, త్రిశూలాలతో వానరులను పొడిచి పొడిచి తరుముతూ వున్నారు. వానరులు భయంతో పరుగెత్తుతున్నారు. అంగదుడెక్కడ? హనుమంతుడెక్కడ? నల, నీలుడెక్కడ? అంటున్నారు.

వానరులు భయకంపితులై పోవడం పశ్చిమ ద్వారం వద్ద మేఘనాధునితో యుద్ధం చేస్తూ వున్న హనుమంతుడు చూశాడు. పశ్చిమద్వారం చాలా గట్టిగా వుంది. బాగా కోపం వచ్చిన హనుమంతుడు మృత్యు దేవత మాదిరి గర్జిస్తూ ఒక కొండను పెకలించి మేఘనాధుని మీదికి వెళ్ళాడు. రధాన్ని విరగ్గొట్టాడు. సారధిని చంపివేశాడు. మేఘనాధుని గుండెల మీద తన్నాడు. మేఘనాధుడు బాధపడుతుండడం చూసి మరో రధసారధి అతణ్ణి ఇంటికి తీసుకవెళ్ళాడు.

అంగదుడు హనుమంతుని వద్దకు వచ్చి చేరాడు. ఇద్దరూ మనస్సులో రామనామ స్మరణ చేసుకుంటూ రావణ మహలు మీదకు ఎక్కారు. 'శ్రీ రామునకూ జై' అంటూ కలశంతో సహా మహలును పట్టుకొని కదిలించేశారు. అది చూసిన రాక్షసరాజు రావణుడు భయపడిపోయాడు. స్త్రీలంతా గుండెలు బాదుకుంటూ ఏడుస్తూ వున్నారు.

ఈ విధంగా వానర లీలలు చేస్తూ శ్రీ రాముని కీర్తిస్తూ వున్నారు. బంగారు స్తంభాలను ఊడగొట్టి ఉపద్రవాలు కలుగ చేస్తున్నారు. శత్రుసైన్యం మధ్యలో దూకి వాళ్ళను చావమోదుతూ వున్నారు. కాళ్ళతో తంతూ వున్నారు. చెంపలు వాయిస్తూ వున్నారు. రామనామస్మరణ చేయక పోతే ఇదే ఫలితం అంటున్నారు. ఒకడి పైన ఒకణ్ణి వేసి చంపి పారేస్తున్నారు. తలలు తుంచి విసరివేస్తున్నారు. ఆ తలలు పోయి రావణుని వద్ద పడి, పెరుగుకుండల్లాగా టపటపా పగిలిపోతూ వున్నాయి.

రాక్షస సేనాపతులు వానరుల చేతికి చిక్కినపుడు వానరులు వాళ్ళ కాళ్ళు పట్టుకొని గిరగిరా తిప్పి రాముని వద్దకు విసరి వేస్తున్నారు. విభీషణుడు ఒక్కొకడి పేరు వరుసగా చెబుతూ వున్నాడు. రాముడు వాళ్ళను తన లోకానికి చేరుస్తూ వున్నాడు. ఈ విధంగా బ్రాహ్మణ మాంసాన్ని కూడా తినే దుష్ట రాక్షసులకు శ్రీ రాముడు పరమ యోగులు యాచించే సద్గతిని కలుగ జేస్తూ వున్నాడు. ఇటువంటి ఉదార చరితుడగు రాముని స్మరించని వాళ్ళు ఎంత మంద భాగ్యులు!

వానర రాక్షస సేనల యుద్ధం జోరుగా సాగుతూ వుంది. వర్షాకాలపు మేఘాలూ శరత్కాలపు మేఘాలూ వాయుదేవుని ప్రేరణతో కొట్టుకుంటున్నాయా

అన్నట్లున్నారు. ఆకంపనుడు, అతి కాయుడు అనబడే సేనాపతులు మాయలు చేస్తూ వున్నారు. క్షణ కాలంలో చీకట్లు కమ్ముకున్నాయి. రాళ్లు, రక్తము, బూడిద కురిపిస్తూ వున్నారు. దశదిశలా అంధ కారం వ్యాపించడంతో వానరులు గాబరా పడి పోయారు. ఒకరి కొకరు కనిపించడంలేదు. ఎక్కడి వాళ్లక్కడ కేకలు వేస్తూ వున్నారు. శ్రీ రాముడు ఈ రహస్యాన్ని గ్రహించాడు. అంగద హనుమంతులను పిల్చి పరిస్థితిని గురించి వివరించాడు. వెంటనే వానర వీరు లిద్దరూ కోపంతో పరుగెత్తారు.

శ్రీ రాముడు నవ్వుతూనే ధనుస్సు ఎక్కు పెట్టాడు. అగ్ని బాణం వొదిలి పెట్టాడు. దాంతో ఎక్కడలేని వెలుగు వచ్చింది. ఎక్కడా చీకటే లేదు. జ్ఞానోదయంతో సందేహాలన్నీ తీరిపోయి నట్లయింది.

వెలుగును చూడగానే వానర భల్లూకాలు అలసటగాని భయంగాని లేకుండా ప్రసన్నంగా శత్రువుల మీదకు వురికాయి. అంగద హనుమంతులు యుద్ధ రంగంలో గర్జిస్తున్నారు. వాళ్ల గర్జన వినగానే రాక్షసులంతా పరుగెత్తి పోతున్నారు.

రాత్రి కావడంతోటే వానర భల్లూకాలు శ్రీ రామచంద్రుని వద్దకు చేరాయి. శ్రీ రాముని కృపాదృష్టితో వాళ్ల అలసట అంతా తీరిపోయింది.

అక్కడ రావణుడు మంత్రులను సమావేశ పరచి-వానరులు మన సేనలను సగం వరకు సంహరించారు. కనుక ఇప్పుడేమి చేయాలో చెప్పమన్నాడు.

అప్పుడు రావణుని తాత గారైన మాల్యవంతుడు లేచి రావణునకు హితవు చెప్పాడు - నువ్వు సీతను అపహరించి నప్పటి నుంచి మనకు అపశకునాలే అవు తున్నాయి. వేదాలు,పురాణాలు కీర్తించిన రాముడికి విరోధిగా నిలబడి ఎవరూ సుఖ పడజాలరు-అన్నాడు.

కాని రావణుడికి ఆ హిత వచనాలు రుచిస్తాయా? బదులుగా మాల్యవంతుని మీదమండిపడ్డాడు.

ఆ సభలోని మేఘనాధుడు లేచాడు. రేపు నా ప్రతాపం చూడమన్నాడు.

కుమారుని మాటలు వినగానే రావణుడికి ధైర్యం వచ్చింది. ఆలోచనల తోనే రాత్రి గడచి పోయింది.

తెల్లవారగానే వానరులు మళ్లీ లంక నాలుగు ద్వారాలను ముట్టడించారు. నగరమంతా కోలాహలం బయలు దేరింది. రాక్షసు లందరూ ఆయుధాలు ధరించి పోరాడుతున్నారు. కోటపై నుండి పెద్ద పెద్ద బండలను విసరి వేస్తున్నారు. ప్రళయ కాల మేఘాల మాదిరి గర్జిస్తున్నారు. వానరులు కొండలు కొండలే పెళ్లగించుక వచ్చి రాక్షసుల మీద విసరి వేస్తున్నారు. రాక్షసులు ఎక్కడి వాళ్లక్కడ చస్తూ వున్నారు.

వానరులు వచ్చి కోటను ముట్టి ముట్టారని మేఘనాధునికి తెలిసింది. వెంటనే ఆ వీరుడు భేరి మ్రోగించి వానరుల ముందు దూకాడు.

సమస్త లోకాలందు ధనుర్విద్యలో ప్రసిద్ధులైన ఆ రామలక్ష్మణు లెక్కడ?

నల, నీల, అంగద, హనుమంతు లెక్కడ? సోదరునికి ద్రోహం తలపెట్టిన విభీషణు డెక్కడ? ఇవ్వాళ నేను అందర్నీ హతమార్చి వేస్తాను-అంటూ ధనుస్సు పైన వాడివాడి బాణాలను ఎక్కుపెట్టాడు. ఎంతో కోపంతో బాణాలు వొదుల్తు న్నాడు. ఆ బాణాలు రెక్కల పాము ల్లాగా ముందుకు దూసుక పోతున్నాయి. ఆ బాణాల్లు తగిలి అక్కడక్కడ వానరులు నేల కూలుతూవున్నారు. మేఘనాధుని ఎదుట ఎవరూ నిలవలేకుండా వున్నారు. వానర భల్లూకాలు పరుగెత్తి పోతున్నాయి. రణ భూమి అంతా ఖాళీ అయిపోయింది. ప్రాణాలతో వున్న వారు ఎవరూ కనిపించడంలేదు.

మహాబలవంతుడైన మేఘనాధుడు సింహంలాగా గర్జించాడు. హనుమంతుడు చూశాడు. తన సేవ అంతా తల్లడిల్లి పోయింది. కోపం వచ్చింది. మృత్యు దేవతలాగా పరుగెత్తాడు. ఒక పెద్దకొండను పెకలించి దాన్ని కోపంతో మేఘనాధుని మీద విసరి వేశాడు.

కొండ తన వైపు రావడం చూసిన మేఘనాధుడు ఆకాశం లోకి ఎగిరి పోయాడు. రథం, సారధి, గుర్రాలు అన్నీ ధ్వంసంఅయిపోయాయి. హనుమంతుడు మాటి మాటికీ సవాల్ చేస్తూ వున్నాడు. కాని హనుమంతుని బలం తెలిసిన మేఘనాధుడు ముందుకు రావడం లేదు.

అప్పుడు మేఘనాధుడు శ్రీరాముడు వున్న చోటుకు వెళ్ళాడు. అనేక దుర్వ చనాలు మాట్లాడాడు. ఎన్నో అస్త్రశస్త్రాలు వొదిలాడు. వాటినన్నిటిని రాముడు తేలికగా కొట్టి పారేశాడు. అటువంటి రామప్రతాపం చూసి మేఘనాధుడు సిగ్గు పడిపోయి ఎదుటపడకుండా మాయలు చేస్తూవున్నాడు. చిన్న పాము పిల్లను చేతబట్టుకొని గరుత్మంతుణ్ణి బెదరిస్తు న్నట్లున్నాడు. ఆకాశంలో వుండి నిప్పులు కురిపిస్తూ వున్నాడు. భూమి మీద జల ధారలు పుట్టుకొచ్చాయి. రకరకాలైన పిశాచాలు బయలుదేరి 'చంపండి, కొట్టండి' అంటున్నాయి. చీము, నెత్తురు, జుట్టు, ఎముకలు కురిపిస్తూ వున్నారు. రాళ్ళు విసుర్తూ వున్నారు. ఆనక దుమ్ము కురిపించి అంతా అంధకారమయం చేశాడు. ఎవరు చాపిన చేతులు వాళ్ళకు కనిపించడం లేదు. ఈ మాయ చూసిన వానరులంతా దిగులుపడి పోయారు. ఈ మాయ ఇలాగే వుంటే అంతా చచ్చిపోతా మనుకున్నారు. ఈ తమాషా చూసి రాముడు నవ్వుకున్నాడు. వానరులందరూ భయపడి పోయినట్లు తెలుసు కున్నాడు. అప్పుడు ఒకే బాణంతో మాయనంతా పటాపంచలు చేసేశాడు. సూర్యోదయంతో అంధకారమంతా తొలగిపోయినట్లయింది. తదనంతరం రాముడు వానర భల్లూకాల వైపు చూశాడు. వాళ్ళందరూ మళ్ళీ బలంపుంజుకున్నట్లు న్నారు. ఆపినా ఆగేటట్లు లేరు.

లక్ష్మణుడు రాముని అనుమతి తీసుకొని, అంగదుడు మొదలగు వానరులను వెంటబెట్టు కొని ధనుర్బాణాలు చేతబట్టుకొని కోపంతో బయలుదేరాడు. కళ్ళు ఎర్రనెక్కాయి.

( ఇంకా ఉంది )


ప్రవర్తన యొక్క మూల సూత్రాలు
న్యాయము
స్వాతంత్ర్యం
సమానత్వం
భ్రాతృత్వం
మత సామరస్యం

ఎంతచేసినా చివరికి మిగిలే ఋణాలు - అర్ధాంతర మరణాలు -మరెన్నో దారుణాలు - సాధారణమను కొంటున్నారా? ఇలాంటి దుష్పరిణామాలకు మీ యింటి వాస్తు దోషాలు కావచ్చు కారణం.



కాశీ నుండి కన్యాకుమారి వరకు వాస్తు పరిశోధనా పర్యటన గావించి, తన వాస్తు పాండిత్య రచనా వైశిష్ట్యం వలన "వాస్తుశాస్త్ర వాస్తవాలు" పలుపత్రికలలో ప్రచురణ కావడానికీ, గ్రంథం రూపం సంతరించుకొనడానికి కారకుడైన రచయిత - నభూతో నభవిష్యత్తుగా సూత్రీకరింప బడిన "వాస్తు సూక్తుల" నిర్మాత - ఖండాలు, అఖాతాల వాస్తు రీతులను అగాధ పరిశీలనార్థం పాఠకుల ముందుంచిన 1993 వాస్తు క్యాలండర్ సంధాత- శ్రీ బి.నాగభూషణ రెడ్డి గారు పదవీ విరమణానంతరం తన అమూల్య వాస్తు సలహాలను అందించేందుకు ఇప్పుడు అందరికీ అందు బాటు లోనికి వచ్చారు. సమస్త వాస్తు సమస్యల పరిశీలనకు, నూతన నిర్మాణాలకు వారిని సంప్రదించండి - సఫలీకృతులు కండి.




శ్రీ బి. నాగభూషణ రెడ్డి

వాస్తు పరిశీలకులు

*5-1879, గీతాశ్రమం రోడ్,*

*ప్రొద్దుటూరు - 516 360.*

కడప జిల్లా.

# స్పష్టత లేని విషయం నిష్ఫలం

శ్రీ బి. నాగభూషణ రెడ్డి, వాస్తు పరిశీలకులు, ప్రొద్దుటూరు.

గత (1994 జనవరి) సంచికలో ఉప్పుగుండూరు వాస్తవ్యులు శ్రీ ఎ.వి. నరసింహారావు గారు "వాస్తుశాస్త్రజ్ఞులూ సలహాలు జాగ్రత్తగా ఇవ్వండి" అనే శీర్షికతో వ్యాసం వ్రాశారు. అందులో నేను వ్రాసిన ఈశాన్య స్థలాల వర్గీకరణను గురించి ప్రస్తావించారు. చాలా సంతోషం: కానీ అది కామెంటో, కాంప్లిమెంటో తెలియక కన్ఫ్యూజన్‌గా వుంది.

ఈశాన్య స్థలం అంటూనే ఓహో! అద్భుతం! అని ఎగిరి గంతులేయాల్సిన పని లేదు - అది నైసర్గికంగా కొన్ని భౌగోళిక లక్షణాలుంటేనే రాణిస్తుంది గానీ కేవలం తూర్పున, ఉత్తరాన రోడ్డున్నంత మాత్రమే యోగించదు అనే విషయం చాలా మందికి తెలియాలనే ఉద్దేశ్యంతోనే కొన్ని స్కెచ్‌ల ద్వారా నేను వివరించడం జరిగింది.

మరి శ్రీ నరసింహారావు గారేమో "ఇటు వంటి వ్యాసాల పుణ్యం వల్లనే అమ్ముకొన్న వారు లాభాలు పొందుచున్నారు-కొన్న వారికి ఒరిగిందేమీ లేదు" అని వ్రాశారు. ఇంకా అసలు ఈశాన్య స్థలానికి సంపద లక్షణం లేదు - వున్న దల్లా మోక్షగుణం. ఈశాన్య స్థలాలు రాణింపు కలిగిన లక్షణం వున్న యెడల అక్కడ వుండేవి ధర్మ పీఠాలు, కల్యాణ మంటపాలు, దేవాలయాలు, యజ్ఞశాలలు, ధర్మసత్రాలు, నేత్రసంబంధమైన ఆసుపత్రులు, నిర్మించే గృహాలు వుంటే అక్కడ గృహ పెద్ద వృద్ధాప్యం చెందక మునుపే కమండలం చేతపట్టుకొని దేశ సంచారానికి వెళ్ళడం, లేదా వున్న యావత్తు సంపద ధర్మ కార్యాలకు వినియోగిస్తూ జీవితం చాలించటం" అని కూడా వ్రాశారు.

ఆయనగారు ఉదహరించిన ధర్మ పీఠాలు, కల్యాణమంటపాలు తదాది అన్ని నిర్మాణాలకును, వాటి నిర్వహణకును ధనమే మూలమనేది ఆయన గుర్తించినట్లు లేదు. పురుషార్థాలైన ధర్మ, అర్థ, కామ, మోక్షాలన్నీ మానవ జీవితానికి అవసరాలే. చివరి మోక్షానికి ఆధారాలు ధర్మ, అర్థ, కామాలు. "యావత్తు సంపద ధర్మ కార్యాలకు వినియోగించడం" అనే వ్రాతలో ఈశాన్యస్థల నివాసులకు సంపద తప్పక వుంటుందనేది స్పష్టమేకదా? ఈశాన్య స్థల గృహస్థులు ఎందరు దేశ సంచారులైనారో వారి వారి పూర్వులలో సర్వే చేసి తెలిసికోవచ్చు. ఏ విషయ మైనా కనీసం 30% వున్నప్పుడే పరిగణన లోనికి తీసికొనాలి.

"అష్టదిశల గుణం పూర్తిగా తెలుసు కొన్నాకే మనిషిని బట్టి, అతని వృత్తిని బట్టి వాస్తు సలహాలు ఇవ్వాలి. ఇది పూర్తిగా సమయస్ఫూర్తి మీద ఆధారపడ్డ లక్షణం" అని వ్రాశారు.

అష్ట దిశల గుణం పూర్తిగా తెలుసుకొన్నాకే వాస్తు సలహాలివ్వాలన్నది అక్షరాలా సత్యం. కానీ మనిషిని బట్టి, వృత్తిని బట్టి అంటే? మనిషి ఎత్తు, లావును బట్టా? బుద్ధిని బట్టా? బ్లెడ్ గ్రూపును బట్టి వాస్తును చెప్పడమా?! వృత్తిని బట్టి అంటే? వేల వృత్తులకు వేల విధాల వాస్తు చెబుతారా?! హతోస్మి! దొంగకొక వాస్తు, దొరకొక వాస్తు–ఔరా!!

"అష్టసిద్ధులు, నవనిధులు కలిసే వుంటాయి. మేధస్సుతో గ్రహించాలి" అని వ్రాశారు. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అనేవి అష్టసిద్ధులు. పద్మము, మహాపద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుండము, నీలము, వరము అనేవి నవ నిధులు. ఇవన్నీ ఒక్కొక్క వూర్లో ఎంతమందికి కలిసి వున్నాయో, ఈ వ్రాత ఒక అభూత కల్పనో ప్రతి ఒక్కరు పరిశీలించండి. వ్యాసరచయిత గారు వీటిని మేధస్సుతో ఎంత మాత్రం గ్రహించారో స్వీయ పరిశీలన చేసికోవాలి. సమయస్ఫూర్తి అంటే సమయానికి తోచినట్లు అని అర్థం. శాస్త్రాన్ని అనుసరించి వాస్తు చెప్పడం శాస్త్రజ్ఞుని లక్షణంగా వుండాలి కానీ సమయానికి తనకు తోచిన విషయం మీద ఆధారపడి వాస్తు చెప్పే లక్షణం వున్న వారిని శాస్త్రజ్ఞులని అనరు.

సనాతన వాస్తు గ్రంథాలలోని సత్యమైన, హేతుబద్ధమైన విషయాల్ని ఎవ్వరూ తిరస్కరించరు. అధునాతన గ్రంథాలలోని దృష్టాంతమైన అనుభవ విషయాలను ఎవ్వరూ నిరాకరించరు.

"జనం క్షణిక గుణం కలవారు, ఫలితాలు కలగాలి అని ఎదురుచూసేవారు" అని వ్రాశారు. జనంలో జ్ఞానం కలిగిన వారు కూడా వున్నారు. అందరినీ కలిపి న్యూనతగా వ్రాయడం సమంజసం కాదు. జనం క్షణకాలం వుండే గుణం కలవారైతే మనమేనా స్థిరమైన గుణం వున్నవారం?

## వైశ్య జాతికే గర్వ కారణము

ఆర్యా!

మీరు సంఘ సేవకులుగా, సంఘాభిమానులుగా, ప్రముఖ పత్రికా సంపాదకులుగా ఆర్య వైశ్య సంఘమునకు ఎనలేని కృషి చేస్తూ, "సంఘోద్ధారక", "వైశ్య భూషణ" అను బిరుదులు పొంది, కీర్తినార్జించుట మన ఆర్య వైశ్య జాతికే గర్వకారణము. మన రాష్ట్రములోని అన్ని ప్రాంతాల వైశ్య సోదరులనూ, వైశ్య ప్రబోధిని ద్వారా ఉత్సాహపరచి, ఆర్య వైశ్య మహాసభ పురోభివృద్ధికి నిరంతర కృషి సల్పి యున్నారనుటలో అతిశయోక్తి లేదు. బీదవారైనా–ధనికులైనా–చిన్నవారైనా–పెద్దవారైనా మీ దృష్టిలో అందరూ సమానులే. మీకు మా అభినందనలు.

జి.వి. చలపతిరావు
రాష్ట్ర ఆవోప ప్రాంతీయ మాజీ కార్యదర్శి
నర్సరావుపేట
తేది. 22.1.1994

మూడు సంవత్సరాల
పూర్తి ప్రేమ
మొదటి బిడ్డ
హక్కు

మాలా-డి వినియోగించండి




గర్భ నిరోధక మాత్రలు

ప్యాకెట్ రెండు రూపాయలు



davp 93/250 Telugu.



డా. జి.వెంకట ప్రసాద్

# 'ఆయుర్వేద మార్తాండ' డాక్టర్ గ్రంధే రఘురామగుప్తగారి "క్యాంపు" వివరాలు



డా.గ్రంథే రఘురామ గుప్త

| | | | |
|---|---|---|---|
| కడప | 13.2.94 | ఆదివారము | గోకుల్ లాడ్జి |
| తిరుపతి | 14.2.94 | సోమవారము | హోటల్ భీమాస్ అనెక్స్ 59, జీ.కార్ స్ట్రీట్ |
| ఒంగోలు | 15.2.94 | మంగళవారము | హోటల్ అభిలాష్ |
| విజయవాడ | 16.2.94 | బుధవారము | హోటల్ అభిలాష్, గవర్నర్ పేట |
| రాజమండ్రి | 17.2.94 | గురువారము | హోటల్ చంద్రలోక్, సాయిక్రిష్ణ థియేటర్ రోడ్ |
| కాకినాడ | 18.2.94 | శుక్రవారము | ఉడిపి వీనస్ లాడ్జి, వల్లభాయి స్ట్రీట్ |
| విశాఖ | 19.2.94 | శనివారము | మేఘాలయ లాడ్జి |
| విజయనగరం | 20.2.94 | ఆదివారము | పూర్ణిమ రెస్టారెంటు అండ్ లాడ్జింగ్ |
| ఖమ్మం | 1.3.94 | మంగళవారము | హోటల్ కిన్నెర |
| వరంగల్ | 2.3.94 | బుధవారము | విజయ లాడ్జి |
| హైదరాబాద్ | 3.3.94 | గురువారము | హోటల్ రాజమాత, నాంపల్లి రైల్వేస్టేషన్ ఎదురు |
| కర్నూలు | 4.3.94 | శుక్రవారము | చంద్ర లాడ్జి |
| గుంతకల్ | 5.3.94 | శనివారము | హోటల్ లేపాక్షి |
| అనంతపురం | 6.3.94 | ఆదివారము | హోటల్ భీమా |
| హిందూపురం | 7.3.94 | సోమవారము | హోటల్ అజంత |

క్యాంపు ఉదయం 9 గంటల నుండి సాయంత్రము 5 గంటల వరకు. పరీక్ష రుసుము రు.25.00 పూర్తి పైకము చెల్లించి ఔషధమును పొందవచ్చును. లేక రు.100/- అడ్వాన్సుగా చెల్లించిన తక్కిన పైకమునకు ఔషధములు V.P.P. గా పంపెదము. కడుపు నొప్పులు, అల్సర్లు, సోరియాసిస్, సమస్త చర్మ వ్యాధులకు ఔషధము తీయబడును.

మార్కాపురం - 523 316.
S.T.D. No. : 08596 ఫోన్ : 2017

మేనేజరు
అమరజ్యోతి ప్రొడక్ట్స్



## కరిమేహము (నల్లమచ్చలు చర్మవ్యాధి) పూర్తిగా బాగైనది.

'ఆయుర్వేద మార్తాండ' బ్రహ్మశ్రీ డాక్టర్ గ్రంధే రఘురామగుప్త గారికి,

ఆర్యా!

1973లో తొడలు, ముఖము, పొత్తికడుపు, అరికాళ్ళు, అరచేతులు, వీపులపై నల్లగా వుండి తీవ్రమైన దురద ఉండినది. అలోపతి, ప్రకృతి వైద్యము రెండు సంవత్సరములు చేసిననూ ఫలితము కనిపించలేదు. మీ ఔషధము 15 రోజులు వాడినంతనే వ్యాధి తగ్గుముఖము పట్టినది. 6 మాసములు వాడిన పిమ్మట మచ్చకూడ లేకుండా పోయినది. ఇప్పటికి 4 సంవత్సరములు జరిగినను మరలా వ్యాధి కనుపించలేదు.

6-18-5, బంక కామురాజా వీధి, క్రొత్తపేట, విజయవాడ.

"దైవజ్ఞ" చేబ్రోలు రోశయ్య గుప్త సిద్ధాంతి, యమ్.డి.హెచ్. ఆర్.యమ్.పి.

## గ్యాస్ట్రైటిస్ వ్యాధి బాగైనది.

ఆర్యా,

సుమారు రెండున్నర సంవత్సరములుగా గ్యాస్ట్రైటిస్ వ్యాధితో బాధపడితిని. కడుపులో మంట, వీపులో నొప్పి, అజీర్ణము ఎక్కువగా ఉండెడిది. 2 మాసములు "మీ" ఔషధము సేవించిననూ, చెప్పుకోదగిన మార్పు కనిపించలేదు. 3వ మాసములో ఒక్కసారిగా నూటికి 75 భాగములు గుణము కనిపించినది.

రొద్దం పోస్టు, మండలము, అనంతపురం జిల్లా. తేది:12.11.93

పి. మౌలాలి, కేరాఫ్ జి.రామచంద్రయ్య, క్లాత్ మర్చంట్

## పిడుగురాళ్ల మార్కెట్ కమిటీ ఛైర్మన్‌గా 'కొప్పురావూరి'



గుంటూరు జిల్లా పిడుగురాళ్ళ అగ్రికల్చరల్ మార్కెట్ కమిటీకి ఛైర్మన్‌గా, పిడుగురాళ్ళ వైశ్య ప్రముఖులు శ్రీ కొప్పురావూరి కృష్ణమూర్తి గారిని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఈ మధ్య నియమించింది. పిడుగురాళ్ళ, దాని పరిసరాలలోని ఆరు మండలాలు ఈ 'కమిటీ' పరిధిలో ఉంటాయి. శ్రీ మూర్తి గారికి ఈ పదవి లభించుటలో గురజాల నియోజకవర్గ శాసన సభ్యులు శ్రీ కె.వి.నర్శిరెడ్డి గారు ఎంతో సహకరించారు. కృష్ణమూర్తిగారు 1940లో మోర్జంపాడు గ్రామములో జన్మించారు. శ్రీమతి కోటమ్మ, వెంకటనారాయణ గారలు వీరి జననీ జనకులు. నిరంతరకృషి, పట్టుదలలతో కృష్ణమూర్తి ఆర్థికంగానూ, ప్రజాసేవలోను మంచి అభ్యున్నతిని సాధించారు

## ఈ నెలలో మీ కర్తవ్యము

(21.2.1994 నుండి 20.3.1994 వరకు)

1. అడ్వాన్సు ట్యాక్సు విధింపునకు అర్హతగల అసెసీలు వారు కట్టవలసిన చివరి కంతు అడ్వాన్సు ట్యాక్సును చెల్లించుటకు రానున్న (1994) మార్చి నెల 15వ తేదీయే చివరిది.

గమనిక : సెప్టెంబరు, డిసెంబరు నెలలలో కంతుల మొత్తము యాభై శాతం పోనూ మిగతా చెల్లించవలసిన అంచనా ఆదాయమును పై తేదీలోగా చెల్లించాలి.

2. ఆంధ్ర ప్రదేశ్ షెడ్యూల్డు కామోడిటీస్ డీలర్సు (లైసెన్సింగ్ అండ్ డిస్ట్రిబ్యూషన్) ఆర్డరు 1982 ప్రకారము పొందిన మీ లైసెన్సు కాలపరిమితి రానున్న మార్చి నెలతో ముగుస్తుంది. ఆ లైసెన్సును తిరిగి పునరుద్ధరించమని కోరుమూ ఈ (1994) ఫిబ్రవరి నెల 28 వ తేదీలోగా దరఖాస్తును పంపడం మరచి పోకండి.

3. మీరు పంపవలసిన A-2 రిటర్న్సును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను అధికారికి పంపుటకు ఈ ఫిబ్రవరి నెల 25వ తేదీయే చివరిది అను విషయాన్ని మరచిపోకండి.

4. మీరు పంపు A-2 రిటర్న్సును చలానాతో బాటు కాకుండా చెక్కులతో బాటు పంపాలను కున్నారా? అయితే ఆ విధంగా A-2 రిటర్న్సును చెక్కులతో బాటు పంపుటను ఈ మార్చినెల 15వ తేదీలోగా చేయాలి.

## శ్రీ శికాకొల్లు సుబ్బారావుగారి స్వర్గారోహణ



ప్రముఖ పారిశ్రామిక వేత్తలూ, మధుర మనస్కులూ, కోరమాండల్ సిమెంట్ కంపెనీ మేనేజింగు పార్టనరూ, ప్రకాశం జిల్లా శింగరాయకొండ పురప్రముఖులూ శ్రీ శికాకొల్లు సుబ్బారావు గారు 20.1.1994వ తేదీన స్వర్గస్థు లయ్యారు. వీరికి శ్రీ చంద్రమోహన్, రమేశ్ చంద్ర, కిషోర్ చంద్ర అని ముగ్గురు కుమారులు.

## యం.యస్. జయరామగుప్త మరణం

అనంతపురం జిల్లా హిందూపురం వైశ్య ప్రముఖులు శ్రీ యం.యస్. జయరామ గుప్త గారు 5.1.94న మరణించారు.

## ప్రభుత్వం నిర్దేశించిన నూనె గింజలు, నూనెల నిల్వల పరిమితి

### (1). ఖాద్య (తిను) తైలముల గింజలు – ఖాద్య తైలములు

| పట్టణము యొక్క తరగతి | నిల్వల పరిమితి (క్వింటాల్లలో) టోకు వర్తకులు | చిల్లర వర్తకులు | |
|---|---|---|---|
| **(ఎ). వేరుశనగ పప్పుతో కూడ ఖాద్య తైలముల గింజలు** | | | |
| (1) హైద్రాబాద్, సికింద్రాబాద్ జంట నగరాలు | 1500 | 100 | 1) అన్ని రకాల నూనె విత్తనాలు కలిసి |
| (2) విశాఖపట్నము, విజయవాడ గుంటూరు, వరంగలు పట్టణాలు | 1000 | 75 | 2) వేరుశనగపప్పు లేక విత్తనాలైతే పైన నిర్దేశించిన నిల్వల పరిమితిలో 75% |
| (3) పై (1), (2) అంశాలకు చెందని ఇతర ప్రాంతాలు | 500 | 50 | |
| **(బి). హైడ్రోజనేటెడ్ వెజిటబుల్ ఆయిల్స్‌తో కూడ ఖాద్య (తిను) తైలములు** | | | |
| (1) హైద్రాబాద్, సికింద్రాబాద్ జంట నగరాలు | 600 | 20 | హైడ్రోజినేటెడ్ వెజిటబుల్ ఆయిల్స్‌తో కూడ ఖాద్య తైలములు అన్నీ కలిపి |
| (2) విశాఖపట్నము, విజయవాడ, గుంటూరు, వరంగలు పట్టణాలు | 400 | 12 | |
| (3) ఇతర ప్రాంతాలు | 250 | 8 | |

*జీ.వో.యంయస్.నెం. 411, ఫుడ్ అండ్ సివిల్ సప్లయిస్ (సి.యస్.-IV) 5 నవంబరు 1993.*

(ii) in clause 11 in the table below the third proviso under subclause (iii), for the existing item (2) producer of edible oils or and the entries relating thereto, the following shall be substituted, namely,

## TABLE

| Producer | Quantity of unmilled pulses or edible oil seeds or mustard seeds. | | Quantity of stock of milled pulses or stock of edible oils including refined oil. | |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) |
| | 2 (a) Producer who is carrying on business on the commencement of this Order. | 2 (b) Producer who has commenced production after the commencement of this order. | 3 (a) Producer who is carrying on business on the commencement of this Order. | 3 (b) Producer who has commenced production after the commencement of this order. |
| 62) Producer of lible Oils. | On height of the maximum quantity of edible oil seeds used by him in any of the three years ending on the 31st day of October, 1989. | For a period of one year from the date of commencement of his production, one eight of the quantity of edible oil seeds that would be required for producing the Quantity equal to his annual installed capacity For the second year and third year of his production, 1/8th of the quantity of edible oilseeds that would be required for quantity equal to his annual installed capacity and there after one-eighth of the maximum Quantity of edible oil seeds used by him in any of the three years immediately after the commencement of his production | 1/24th of his maximum production in any of the three years ending on the 31st of October, 1989. | For a period of one year from the date of commencement of his production 1/24th day of a quantity equal to his annual installed capacity. For the Second Year and third Year of his production, 1/24th of the quantity equal to his annual installed capacity and thereafter 1/24th of the maximum of his production in an of the three years immediately after the commencement of his production. |
| Producer of edible Oils. Contd.) | On height of the maximum quantity of edible oil seeds used by him in any of the three years ending on the 31st day of October, 1989. | | 1/24th of his maximum production in any of the three years ending on the 31st of October 1989-(Contd.) | |

R. KODANDARAMA REDDY,
*Ex-Officio Secretary to Government.*

సంపూర్ణమైన అర్థము అవగతమగుటకై ఈ భాగమును ఉన్నదున్నట్లుగా ఆంగ్లములోనే ప్రచురించాము.

*జీ.వో.యంయస్.నెం. 411, ఫుడ్ అండ్ సివిల్ సప్లయిస్ (సి.యస్.-IV) 5 నవంబరు 1993.*

తెలుగులో

# కంప్యూటర్ జాతకం

Rs. 175/-

మీ భవిష్యత్తును తెలుసుకోండి.

ఎటువంటి పంచాంగమును ప్రామాణికముగా తీసుకొనకుండా పూర్తిగా ప్రాచీన ఖగోళ శాస్త్ర సూత్రాల ప్రకారం, పూర్తిగా అక్షాంశ, రేఖాంశలతో కూడిన **బి.వి.రామన్ అయనాంశము** ప్రకారము కంప్యూటర్ చే లెక్కించి జాతక చక్రము తయారుచేసి ప్రాచీన జ్యోతిష శాస్త్రము ప్రకారము దేశములోని ప్రముఖ జ్యోతిష వేత్తలచే జాతక చక్ర ఫలితాలను చెప్పబడును.

ప్రతి పూర్తి జీవిత కాలపు రిపోర్టునందు పూర్తి వివరంగా జన్మ నక్షత్రము, జన్మ తిథి, జన్మ లగ్నము, నిత్య యోగము, పాదాలతో వివరించబడిన లగ్నజాతక చక్రము, భావము, నవాంశ చక్రములతో పూర్తి జీవిత కాల (ఇక్కడ ఆయుర్దాయమును పరిగణించటం లేదు.) దశాపహారము పట్టిక, అష్ట వర్గము, నిరయణ స్ఫుటంలో సమగ్రమైన ఫలితాలతో పాటు మీ భవిష్యత్తుకు సంబంధించి విద్య, వ్యాపారము, వివాహము, మొదలగు విషయాలతో కూడిన సమగ్రమైన *18-24* పేజీల కంప్యూటర్ జాతకము కొరకు ఈ క్రింది చిరునామాకు రు.*175/-*లు మనియార్డర్ కాని, డి.డి. కాని, కె.శ్రీనివాసరాజు పేరు మీద కడపలో చెల్లు విధముగా పంపి మీ ఖచ్చితమైన భవిష్యత్తును తెల్సుకోండి.

——— మీరు పంపవలసిన వివరాలు ———

పేరు, పుట్టిన తేది, సమయము, స్థలము (మండలము, జిల్లా)

రు.175/-లు డి.డి. లేక మనియార్డరు

For More Detials Send Your Enquires.

**K.S.RAJU ASTROLOGY CENTRE**

Room No.4&5, Haroon Complex, Beside Ramesh Theatre,
Cuddapah

